

ఓ.వి.జి.కె.చంద్రమౌళీశ్వరరావు

# నవజీవనం

# నవజీవనం

( అవతార్ మెహెర్‌బాబా నవజీవన ఘట్టం )

## తృతీయ భాగం

: సంకలనం :

జి. వి. జి. కె. చంద్రమౌళీశ్వరరావు




అవతార్ మెహెర్‌బాబా మచిలీపట్నం సెంటరు
మచిలీపట్నం

# NAVAJEEVANAM

( Third Part )

Compiled by

G. V. G. K. CHANDRAMOULESWARA RAO

First Edition : 13th October 1984

Copies : 1000

PRICE : Rs. 5-00

Title Design by

Dr. G. V. PURNACHAND, B. A., M. S.,

For Copies

G V. G. K. Chandramouleswara Rao
29-36-12 Museum Road
VIJAYAWADA - 520 002

or

Avatar Meherbaba Machilipatnam Centre
Machilipatnam - 521 001

at Spandana Printers

2

# ఉపోద్ఘాతము

జై బాబా! అందరూ కోరేది నవజీవనం. రాతిరూపం నుంచి, మానవరూపం పొందేవరకూ, ఎన్నో జన్మల పరిణామం జరిగింది. మానవరూపంలో గూడ, తీర్చిదిద్దిన, అందచందాలు మాత్రమే గాక, మానశిక వికాసమునకు, హృదయ సౌశీల్యమునకు, దివ్యజ్ఞానము అనుభూతి కలిగే వరకు, యింకా ఎన్నో జన్మ పరంపరలు ఒకదానికి మించిన మరొకటి జరుగుతున్నవి. స్వస్వరూప జ్ఞాన, అనుభూతియే యీ నవజీవన సారాంశం.

అందము యొక్క ఆనందాన్ని మానవునకు, స్త్రీ, పురుషులుగా, ప్రకృతి రమణీయ దృశ్యములతో, శాస్త్రీయ పరిజ్ఞానంతో నూతన భవనములు, యంత్రములు, వాహన సౌకర్యములు, భోగభాగ్యాలు, శరీర సౌష్టవం, మున్నగునవెన్నో చెప్పనలవికాని సౌకర్యములు దైవం అందించిన కొద్దీ, మానవ మేధస్సు సత్య ప్రేమలను రూపొందించుటకు బదులు, స్వార్ధచింతనతో, కామ క్రోధ లోభ మోహ మదమాత్సర్యాలను అదుపు ఛేయలేని పరిస్థితులలో చివరకు, ఉన్నతోన్నత స్థితిలో వున్నట్టి, సర్వమూ తానై యున్నటువంటి బ్రహ్మ స్వరూపం నుండి, మానవరూపంతో దివి నుండి భువికి దిగివచ్చి, మానవాళి యావత్తు భారము తనపైన వేసుకొని, ప్రతి యుగంలో సరిదిద్దవలసిన అవసరం కలుగుతున్నది.

ఇందు కొరకు, తానెన్నో అపహాస్యములకు గురై, ఎంతో చిన్న విషయంగా కనిపించే స్వస్వరూప జ్ఞానం కలుగచేయుటకు, జగన్నాటక సూత్రధారిగా, భగవంతుడు తన సత్యజ్ఞాన ఆనందముల విడుదల ద్వారా సృష్టి కార్యక్రమ పురోగతికి, తోడ్పడవలసి వస్తున్నది.

ప్రస్తుత పరిస్థితులు, సృష్టి వుద్భవించి అనంతకాలమైనప్పటికీ దేవాలయములు, పూజా గృహములు, మారణహోమమునకు దారితీయుచున్నవి. సశ్యశ్యామలమై జీవనోపాధికి ఎంతో సహకరించిన భూదేవి భరించలేని మారణాయుధములు, దుష్టశక్తులు, తన బిడ్డల అన్యోన్య అసహనములకు భీతి చెంది, సృష్టిరక్షణకై దైవావతరణకు నాంది పలుకుతోంది.

యీ యుగావతారుడుగా మెహెర్‌బాబా మానవ హృదయ వికాసం కొరకు మానశిక దుష్టశక్తులను అదుపులో వుంచుటకు యీ నవజీవన కార్యక్రమం ద్వారా నూతన పంథాలో కాలానుగుణ్యంగా జీవితమును గడిపి, మనం తెలుసుకోలేనటువంటి వూహకందనటువంటి ఆధ్యాత్మిక సోపానము లందించి, తన కార్యక్రమమును నూటికి నూరుపాళ్ళు జయప్రదంగా నిర్వహించారు.

అహం పోతే బ్రహ్మం వస్తుంది. దానికే నవజీవన కార్యక్రమం. ఈ నవజీవనాన్ని తేటతెలుగులో శ్రీ జి. వి. జి. కె. చంద్రమౌళీశ్వరరావు గారిచే సంకలనం చేయబడిన నవజీవనం 3 వ భాగం కూడ మా మచిలీపట్నం మెహెర్ సెంటరు కార్యక్రమంగా పరిగణించబడి 1984 అక్టోబరు 13 వ తేదీన విజయవాడలో జరుగనున్న అవతార్ మెహెర్‌బాబా ప్రేమిక సాహవాస్‌లో ఆస్ట్రేలియా నివాశి ప్రముఖ బాబా ప్రేమికులు శ్రీ విలియం లీపేజీ గారిచే ఆవిష్కరించబడుట బాబా కృపా విశేషం. ఈ సంకలనంలో రచయిత చేసిన కృషి ఫలితం అందరూ పాలుపంచుకొన కలిగి అవతారుని ప్రేమకు పాత్రులగుటయే మా ఆశయం.

ఇట్లు

మచిలీపట్నం
13—10—84

తాడేపల్లి బసవయ్య
అధ్యక్షులు
అవతార్ మెహెర్‌బాబా మచిలీపట్నం సెంటరు

# అభినందనలు

సోదరులు శ్రీ జి. వి. జి. కె. చంద్రమౌళీశ్వరరావుగారు బాబా వారి సాహిత్యమును, ఆంధ్ర ప్రజానీకానికి యీ క్రింద వుదహరించిన చాలా గ్రంథాలు సులభ శైలిలో సంకలనంచేసి, ప్రచురించి, అనేకమంది బాబా ప్రేమికుల ప్రశంసలను అందుకున్నారు.

1. మెహెర్ కథామంజరి 1, 2 భాగాలు
2. మెహెర్ మండలి
3. నవజీవనం 1, 2, 3 భాగాలు
4. మెహెర్ మందారం

ఈ సద్గ్రంథములను చదివి, పలువురు బాబా ప్రేమికులకు చెప్పే సదవకాశమును బాబా సెంటర్ల నిర్వాహకులకు కల్పించినారు. ఈ గ్రంథములన్నీ బాబా ప్రేమికులందరికి, చదువుకొనుటకు అందుబాటులోను, సులభశైలిలోను వ్రాసియున్నారు. ఈ గ్రంథములు గంభీరమైన ఆధ్యాత్మిక విలువలు తెలియజేయుచున్నప్పటికీ, వీటిని చాకచక్యముతో ఎదుర్కొని, అందరికీ అర్థమయ్యే విధంగా వ్రాయుటలో రచయిత చాల కృషి చేశారు.

అవతార్ మెహెర్‌బాబా, వీరు చేయుచున్న కృషిలో సహాయ పడుతూ, తాను చేపట్టిన దీక్షను ద్విగుణీకృతము చేయుటకు తగిన ఉత్సాహము ఇచ్చుగాక ! అవతార్ మెహెర్‌బాబా వీరి కన్ని విధములుగా సహాయపడు గాక !

విజయవాడ
13-10-84

ఇట్లు
వై. మాణిక్యాలరావు

# నమస్సుమాంజలి

బాబా నవజీవనం ప్రారంభించి బెనారస్ చేరేంతవరకూ జరిగిన సన్నివేశాల్ని ప్రథమ భాగంలో సంకలనం చేయటం జరిగింది. కాశీలో నాతీయిమ్లీ భవనంలో దిగిం దగ్గరనుంచి, మంజరీమాఫీ చేరేంతవరకూ రెండవ భాగంలో సంకలనం చేయబడింది.

బాబా తన సహచర మిత్రులతో కొనసాగించిన నవజీవనం మంజరీమాఫీ నుండి అరంభమై, 16–10–1950 న మహాబలేశ్వరంలో ఒక్కరోజు పూర్వ జీవన మిత్రులతో జరిపిన సమావేశం, ఉత్తర భారతంలో నేపాళదేశం నుండి దక్షిణాపథాన మద్రాసు వరకు కొద్దిమంది సహచర మిత్రులతో విశేష రీతిలో జరిపిన పేదల కార్యక్రమం, మస్తు కార్యక్రమం పూర్తిచేసుకొని మళ్ళీ 1950 డిశంబరు మొదటి వారంలో మహాబలేశ్వరం చేరేవరకు జరిగిన నవజీవన విశేషాలన్నీ యీ మూడవ భాగంలో వివరించబడ్డాయి.

ఆంధ్ర బాబా ప్రేమికులీ నవజీవన ఘట్టాలన్నీ సులభంగా గ్రహించేందుకు వీలుగా ప్రత్యేక శ్రద్ధ తీసుకొన్నాను. మెహెర్‌బాబా గడిపిన జీవితాన్ని వివరించేప్పుడు ఆ యా సంఘటనలు కళ్ళముందు కనపడేట్లుగా వర్ణించుటకు ప్రయత్నం చేయబడింది.

దైవమానవుడు తన నవజీవన ఘట్టంలో గడిపిన బాహ్య జీవనాన్ని కళ్ళకు కట్టినట్లు చిత్రించాననటం అతిశయోక్తే అవుతుంది. కానీ ధైర్యంతో ఒక్క విషయం మాత్రం చెప్పగలను. యిప్పటివరకూ సంకలనం చేయబడిన యీ నవజీవనం మూడు భాగాలు వెలువరించటంలో

ముఖ్యోద్దేశం, తెలుగులో లభ్యంగాని యీ యుగావతారుని దివ్యలీలా విశేషాల్ని ఆంధ్ర ప్రేమిక లోకాని కందించి, ఆధ్యాత్మిక చరిత్రలో మెహెర్‌బాబా వారి నవజీవనానికి సాటి మరోటి లేదన్న తీర్పు చదువరులే చెప్పాలన్నది నా ఆకాంక్ష.

నిజం చెప్పాలంటే యుగావతారుని నవజీవన లీలామృతాన్ని వివరించి చెప్పే తాహతు నాకు లేదు. బాబా ప్రేమ సాగరుడు కావున, మానవాళికోసరం ఆయన చేసిన విశేష కార్యక్రమాన్ని ఆయన కృపతోనే నేను సాహసించి అనేక సంఘటనల్ని, సందేశాల్ని సేకరించి ఒక వరుస క్రమంలో, కథా రూపంలో పొందుపరచాను. ముఖ్యంగా యీరుచ్, బాలనాట్, ఆదీజీలతో అనేక పర్యాయాలు జరిపిన సంభాషణల్లో అచ్చులో దొరకని ఘట్టాలెన్నో సేకరించి, యిందులో సంకలనం చేయడం జరిగింది. వారికి నా హృదయ పూర్వక కృతజ్ఞతలు.

1984 అక్టోబరు 13, 14, 15 తేదీలలో విజయవాడలో జరిగే మెహెర్‌బాబా సాహవాస కార్యక్రమంలో ఆవిష్కరించాలని అనుకొన్నంతలోనే, మచిలీపట్నం సెంటరు కార్యదర్శి శ్రీ గుడివాడ రామచంద్రరావు గారు స్వయంగా పూనుకొని, యీ మూడవ భాగం యింత సర్వాంగ సుందరంగా అనతికాలంలో వెలువడునట్లు సహాయపడినందుకు వారికి నా హృదయ పూర్వక అభివాదములు.

ఎన్ని వత్తిడి పనులున్నా యీ పుస్తకాన్ని సకాలంలో అచ్చొత్తించి యిచ్చిన స్పందన ప్రింటర్సు మచిలీపట్టణం వారికి నా ప్రత్యేక ధన్యవాదాలు.

నా మీద తమ అవ్యాజానురాగాలు ప్రదర్శిస్తూ, నా రచన లన్నిటినీ ప్రోత్సహిస్తూ వుత్సాహపరచి యింతకుముందు రచనల వలెనే, యీ మూడవ భాగ ప్రచురణ బాధ్యతను కూడ తీసుకున్న అవతార్ మెహెర్‌బాబా మచిలీపట్నం సెంటరు వారికి, ఆధ్యక్షులు శ్రీ తాడేపల్లి బసవయ్యగారికి హృదయ పూర్వక నమస్సుమాంజలులు.

అశేషాంధ్ర ప్రేమిక సమక్షంలో విజయవాద ప్రేమిక సాహవాస సమయంలో పూజ్యులు, సోదరులు విలియమ్ లీపేజీ ( ఆస్ట్రేలియా ) అమృత హస్తాలతో యీ సంకలనం ఆవిష్కరింపబడుట ప్రియతముని యిచ్ఛగా భావిస్తూ సహృదయులైన ప్రేమికలోకం చదివి, ఆనందించి బాబా ప్రేమలో తరించెదరని ఆశిస్తున్నాను.

మచిలీపట్నం
13–10–84

జై బాబా
జి. వి. జి. కె. చంద్రమౌళీశ్వరరావు

# నియమోల్లంఘన ఫలం

నజీబాబాదు మజిలీలో బాబా కాలినడకకు స్వస్తి చెప్పారు. స్త్రీలు మరికొందరు పురుషులతో నజీబాబాదు నుండి రైలుపై, కాచును టోకు వ్యాపారం చేసే వ్యక్తి కొనిచ్చిన టిక్కెట్లతో డెహరాడూన్ చేరారు. జంతువులు, బళ్ళు వగైరా సరంజామాని రైల్లో చేర్చుట సాధ్యపడలేదు. అందువలన జంతు సరంజామా నంతటిని, పెండూ నాయకత్వంలో, రాజమార్గంలో డెహరాడూన్ చేరే ఏర్పాటు చేశారు. డాన్కిన్ తోలే టాంగా అన్నిటికీ ముందుంటే, పెండూ కారవాన్ తోలుతూ గార్డులా ఆఖరులో వున్నాడు. వారివురి బళ్ళ మధ్య, బైదులు, పాటిలు, అలోబాలు తోలే బళ్ళున్నాయి.

ప్రధాన రహదారిగుండా బళ్ళు కొన్ని మైళ్ళు పయనించాయి. అంతలో నాలుగురోడ్ల కూడలి ఒకటి రాగా, ఏ మార్గంలో ముందుకు సాగాలో కొందరిని సంప్రదించారు. గ్రామస్తులు కొందరు డెహెరాడూన్ చేరేందుకు రాజమార్గం చుట్టని, దగ్గర దారి వేరే వుందని సూచించారు. తమ గమ్యాన్ని అతి త్వరగా చేరాలనే తాపత్రయంతో పాపం! మిత్రులు, బాబా యిచ్చిన "ప్రధాన మార్గం ద్వారానే పయనించండన్న" బాబా సూచనను మరచారు. దగ్గర దారి పట్టారు.

దారిలో ఓ వంతెన దాటవలసి వచ్చింది. బళ్ళ నిండా బరువుండుటతో కారవాన్ బండి చక్రం ఒకటి వంతెనపైన

బురదలో కూరుకుపోయింది. మిత్రులంతా కలసి ఎంత ప్రయత్నించినా ఎడ్లు బండిని లాగలేకపోయాయి. చివరికెలాగో కొందరు గ్రామస్తులు సహాయం రాగా, కొన్ని ఎండుకొమ్మలు, ఆకులలములు బురదలో కుక్కి బండిని అతి ప్రయాసమీద బయటకు లాగారు.

బాబా ఆజ్ఞ ధిక్కరించినందుకు ఫలితం అంతటితో ఆగలేదు. ఆ మట్టి రోడ్డు పోగా పోగా, ఒక అడవిగుండా మలుపు తిరిగింది ఆ అడవిలో క్రూర మృగాలున్నాయి. కాలం కలసి రావాలన్న తలపుతో బృందం తమ ప్రయాణ గమన వేగం పెంచింది. అంతలో పొద్దు గ్రుంకింది. అదృష్ట వశాన, అడవి మధ్యలో, అటవీ శాఖాధికారుల కొరకు నిర్మించబడిన విశ్రాంతి మందిరం ఒకటి కనపడింది. దాని కాపలాదారుని మంచి చేసుకొని, ఆ రాత్రికి అక్కడ మకాం చేశారు.

అడవి మృగాలు దరిరాకుండా పెద్ద నెగడు వెలిగించారు. జంతువులన్నిటినీ ఆ మంట చుట్టూ కట్టారు. అర్ధరాత్రయ్యే సరికి వర్షం ప్రారంభించింది. ఎలాగో, ఆ బంగళా కాపలాదారుని బతిమాలుకొని, ఆ రాత్రి దాని వరండాలో తల దాచుకున్నారు. తెల్లవారగానే తమ ప్రయాణం తిరిగి సాగించారు. దగ్గర దారిన పయనించినా, అనుకోని సంఘటనల వలన, ఆలస్యమైంది. సరియైన భోజనం లేదు. రెండు మూడు రోజులపాటు ఒక పూటే భోంచేశారు. ఎలాగైతేనేం! పాపం! మిత్రులు బాబా

ఆజ్ఞలు పాలించనందుకు, అష్టకష్టాలుపడి చివరకు డెహెరాడూన్ చేరారు.

మిత్రులంతా డెహెరాడూన్ చేరిం తర్వాత, నవజీవనంలో మిత్రులాచరించ వలసిన నిబంధనలు కొన్నిమార్చాలని బాబా తలపెట్టారు. వారంతా అప్పటివరకు, అనేక ఘట్టాలుగా శిక్షణ, భిక్షుక వృత్తి, హిప్పీ జీవనం గడిపారు. ఈ ఘట్టాలన్నీ వారిలో వున్న బలహీనతలు, గొప్పదనాలు గుర్తించుటకు, గుణపాఠాలుగా ప్రయోగపడ్డాయి.

ప్రతివారు, మంచీ, చెడు, సుఖం-దుఃఖం, సౌఖ్యం-అసౌఖ్యం అనే ద్వంద్వానుభవాల రుచి చవి చూచారు. నవజీవనంలో గుంభన మేమిటో, త్రిల్లేమిటో గుర్తించారు. వాళ్ళెన్ని కష్టాలెదుర్కొన్నా మరుక్షణంలోనే, నైరాశ్యంతో చిరు నవ్వులు చిందించే అలవాటు పడ్డారు. బాబా మాత్రం ఎప్పుడూ తన హాశ్య చతురత విడనాడలేదు. ఒక్కొక్కప్పుడు మిత్రుల నుభవించే కష్టాల మధ్య బాబా చిరునవ్వులు పూరట కలిగించేవి.

డెహెరాడూన్ చేరింతర్వాత, మిత్రులతో అనేక పర్యాయాలు దీర్ఘంగా చర్చించారు. పెండూ పార్టీ, డెహెరాడూన్ చేరగానే తన నిర్ణయాన్ని ప్రకటించారు.

## త్రైసూత్ర పధకాలు

అది జనవరి 15వ తారీఖు. బాబా మిత్రులతో సమావేశమయ్యారు. ఇప్పుడు నేను మీముందు మూడు పధకాలుం

బోతున్నాను. అవి నా యిచ్ఛ ప్రకారం జారీచేసే ఆజ్ఞలుగా స్వీక రించి మీరంతా అందులో ఏదో ఒక పథకం అంగీకరించాలి. వ్యక్తిగతంగా కానీ, సామూహికంగా కానీ, మీరా పథకాన్ని పాటిస్తూ, నూటికి నూరుపాళ్ళు నా మిత్రులవలె నాతో నవజీవనం సాగిస్తూనే వుంటారు. ఈ మూడు పథకాలు నన్ను నవజీవనంలో స్వేచ్ఛగా గడిపేందుకు, నూరు పాళ్ళు మీరు నాతో నవజీవనంలో వుండేందుకు, సహాయపడగలవు. ఇప్పటి వరకూ జరిగిన మూడు భాగాలు, భిక్షుక వృత్తి, హిప్పీ జీవనం, లంగోటీ జీవనం, వ్యక్తిగతంగా, నా ద్వారా మాత్రమే జరిగాయి. ఇప్పుడు చెప్ప బోయే మూడు పథకాల్లో రెండు ముఖ్యమైన సూచనలున్నాయి. 1) దైవం ముందు బాధ్యత 2)ఆధ్యాత్మిక లాభం. ఈ రెండూ శాశ్వతంగా వుండేవి.

మొదటి పథకం మూడు భాగాలుగా వుంటుంది. అవి ఎ. బి. సి. లనే మూడు వేర్వేరు భాగాలు. 'ఎ' సామూహికంగా నిర్వర్తించాలి. 'బి' వ్యక్తిగతంగాకానీ, సామూహికంగా కానీ నిర్వర్తించాలి. 'సి' వ్యక్తిగతంగానే నిర్వహించాలి.

రెండవ పథకం ప్రకారం, ఎవరైనాసరే వారిష్టం వచ్చిన వ్యాపారం చేసుకోవచ్చును. లేదా ఉద్యోగం చేయవచ్చును. మూడవ పథకం క్రింద 1949 ఆగస్టు 31న మెహెరాబాదు సమా వేశంలో అంగీకరించిన నిబంధనలన్నీ తు.చ. తప్పక పాటించాలి. ఈ మూడు పథకాలకు మళ్ళీ యిలా వివరణ యిచ్చారు.

ఒకటి 'ఎ' పథకం ప్రకారం అంతా సామూహికంగా సంపాదించి, కలసి ఖర్చు పెట్టుకోవాలి. వచ్చే ఆదాయంతో బాబాకు సంబంధం లేదు. వారు అప్పుడప్పుడూ బాబాను కలుసుకో వచ్చును.

ఒకటి 'బి' పథకంలో వున్నవారి అధీనంలో బళ్ళు, టాంగాలు, జంతు సరంజామా అంతా వుంచబడుతుంది.

ఒకటి 'సి' పథకంలో వుండేవారిని, వారివారి వూళ్ళకు వెళ్ళిపోయి, ఇంటి దగ్గరే వుంటూ నవజీవనం గడపాలన్నారు. ఒకటి 'ఎ' పథకంలో వలెనే, ఒకటి 'సి' పథకంలో కూడ ఇంటి దగ్గరున్నా, ఏదైనా వ్యాపారంగానీ, వుద్యోగంగానీ చేయవచ్చునన్నారు. అట్టివారు తమకు అవుసరమయ్యే పైకం సంపాదనలో మిగుల్చుకొని, మిగిలిన పైకాన్ని బాబాతో వుండదలచుకున్నవారి పోషణ కొరకు పంపాలి. అట్టివారు బాబా సహవాసంలో మరెన్నడూ పాల్గొనరాదు. వారాయనతో వుత్తర ప్రత్యుత్తరాలు కూడ జరుపరాదు.

రెండవ పథకం, ఒకటి 'సి' పథకం లాంటిదే. ఈ పథకాన్ని ఎంచుకున్న మిత్రుడు, పూర్వ జీవనంలో తామున్న వూరే కాక, మరేదైనా వూరు వెళ్ళి వుండవచ్చును. ఈ పథకంలో వుండే వారికి, ఎట్టి విధులు నిర్వచించబడవు. అట్టివారు తమ యిష్టం వచ్చిన జీవితం గడపవచ్చును.

మూడవ పథకం ప్రకారం, నవజీవనానికి ముందు తీసుకున్న నియమాలప్రకారం నిబంధనలన్నీ పాటించాలి. ఈమూడు

పథకాల వివరాల కాపీలు తీయించి, అందరికీ పంచిపెట్టారు. రెండు మూడు రోజులు సుదీర్ఘ చర్చలనంతరం, మిత్రులంతా తలొక పథకం ప్రకటించారు.

ఒకటి 'ఎ' పథకం, అంతా ముక్త కంఠంతో తిరస్కరించారు. డాన్కిన్, కాకా, గుస్తాద్జీలు ఒకటి 'బి' పథకాన్ని ఎంచుకున్నారు. డాన్కిన్ తక్కిన యిరువురి బాధ్యత తీసుకున్నాడు. ఆదిజీ, ఘనీ, బాబా దాసు, అన్నా 104, ఒకటి 'సి' పథకంలో వుండుటకు కట్టుబడ్డారు. రెండవ పథకాన్ని ఎవరూ అంగీకరించలేదు.

మిగిలిన ఎనిమిది మంది మిత్రులు, నీలూ, పెండూ, బైదులు, ఈరుచ్, మురళి, విష్ణు సదాశివ పాటిల్, అలోబాలు మూడవ పథకం పాటించాలని నిశ్చయించారు. మిత్రులంతా దైవం ముందు ప్రమాణం చేసి, ఆయా పథకాలలో వుండుటకు తమతమ నిర్ణయాల్ని ప్రకటించారు, దైవ మానవుని సాంగత్యలో వుండి ఆయనకు సేవ చేయడమంటే మాటలు కాదు. నిస్వార్థ త్యాగంతో ఆయనను తృప్తిపరచుట అంత తేలికగాదు. అది నిప్పుతో చెలగాటం వంటిది.

## ఆధ్యాత్మిక అత్యవసర పరిస్థితి

అది 1950 జనవరి 25. ఆనాడు 1సి పథకం అంగీకరించిన ఆదీ, ఘనీ, బాబా దాసు, అన్నా 104 డెహ్రాడూన్ నుండి తమ తమ వూళ్ళకు వెళ్ళిపోయారు. డాన్కిన్ 1బి పథ

కం ప్రకారం డెహెరాడూన్‌లో వైద్య వృత్తి ప్రారంభించి ఓ హాస్పిటల్ తెరిచాడు. మూడవ పథకంలో మిగిలిన ఎనిమిది మందికీ మేనేజరుగా బాబా విష్ణుని నియమించారు.

బాబా ఆజ్ఞలు విధేయతతో పాలించుట కొనసాగుతోంది. నవజీవనంలోని ఈ కొత్త పథకాలు, అత్యవసర పరిస్థితిలా కొందరికనిపించింది. ఒకరోజున జరిగిన సమావేశంలో బాబాను మిత్రులు, అవతారునిగా, దైవంగా లేదా దయ్యంగా ఎలా అనుకున్నా, తాను వారిమధ్య మానవునిగా నివసిస్తున్నందున, ఆయన సోదరుడేగానీ, మిత్రుడేగానీ ఏదైనప్పటికీ, న్యాయానికి తాను వారికి గురువునన్న సత్యం మరువరాదని హెచ్చరించారు.

రానున్న మార్చి 1వ తేదీనుండి పూర్తి విధేయత పాటించాలని హెచ్చరించారు. బాబా చేతలు మానవుని మేధకు అంతు చిక్కవు. వూహాకందని రీతిలో వుండును. ఇటువంటి తీవ్ర చర్చల సందడిలో ఓ హాస్య సంఘటన జరిగింది. అన్నా 104 తన వూరు వెళ్ళే హడావిడిలో గుస్తాద్‌జీ బెడ్డింగు తన బెడ్డింగను కొని తీసుకు వెళ్ళిపోయాడు. గుస్తాద్‌జీకి అవుసరమైన వస్తువులు వున్ని దుస్తులా బెడ్డింగులో వుండుటచేత ఆయన తన అవస్థను సౌంజ్ఞలద్వారా అందరికీ వివరించాడు. గుడ్డలు లేక చలిలో అవస్థపడుతున్న గుస్తాద్‌జీని చూచి, అంతా జాలిపడ్డారు. కొన్నాళ్ళయింతర్వాత, గుస్తాద్‌జీ సామాన్లన్నీ డెహెరాడూన్ తెప్పించబడినవి.

డాన్కిన్‌ను బాబా బొంబాయి పంపి, ఆడవాళ్ళకు కుట్టు పనికి అవసరమైన సరంజామా తెప్పించారు. వస్తూ నారిమన్ గారింటికి వెళ్ళిన జాను మంజరిమాఫీ రమ్మనమని చెప్పమన్నారు. ఇప్పుడు బాబా, కేకీ నాలావాలా, కుమార్‌లను తప్ప మరెవ్వరినీ చూడటంలేదు.

ఒక రోజున నాలావాలా యింటికి స్వయంగా వెళ్ళారు. ప్రేమతో అందరి కుశలములు ప్రశ్నించారు. నాలావాలా భార్య ఫ్రీనీ, తన భర్త ఎప్పుడూ జీవితంలో విరక్తితో బాధపడుతూనే వుంటారని విన్నవించింది. అప్పుడు బాబా ఒక చక్కని సలహా యిచ్చారు. నీకు నీవే బాధపడుతూ వుంటే, భగవంతుడు నీ కొరకు బాధపడడు. ఆయనెందుకు బాధపడాలి. నీవు బాధపడుట మానితే నీకోసరం భగవంతుడు బాధపడతాడు. హృదయపూర్వకంగా ఆయనను గుర్తుంచుకో, నీ బాధలన్నీ ఆయనకు వదిలేయ్. సంతోషంతో స్వేచ్ఛగా వుండు. ఎప్పుడైతే నా ప్రేమికులు నన్ను ఏకాగ్రతతో పిలుస్తారో, అట్టివారిని తృణీకరించేందుకు నాకు ధైర్యం వుండదు" అన్నారు.

తెల్లగుర్రం పోషణ డాన్కిన్ చూస్తున్నాడు. రెండుఎద్దులు "వచ్చీదునియా" (పిల్లల ప్రపంచం) అనే సంస్థకు బహూకరించారు. నజా బొంబాయినుంచి వచ్చింది. వంటయింటి బాధ్యత స్వీకరించింది. బాబాకు యిష్టమైన పదార్థాలు తయారుచేయుటలో నజా దిట్ట.

ఆ సంవత్సరం జోరాష్ట్రియన్ క్యాలెండరు ప్రకారం ఫిబ్రవరి 12వ తేదీనే బాబా జన్మదినం వచ్చింది. ఆరోజు చలి విపరీతంగా వున్నా కొద్దిమందిని జన్మదిన వేడుకల్లో పాల్గొనుటకు పిలిచారు. అందరికీ రవ్వకేసరి ప్రసాదంగానూ, బజ్జీలు ఫలహారం గాను పంచిపెట్టారు. ఆఖర్లో అందరికీ టీ పంచారు.

ఆ మర్నాడు, ఏర్పాటువాలాలైన, నారిమన్, మెహెర్జీ లను సహాయ పడేందుకై సదాశివపాటిల్ పూనా బయలుదేరాడు. ఒక మిత్రుని హరిద్వారం పంపి, రెండు కూజాల నిండా పవిత్ర గంగాజలం తెప్పించారు. కొన్నాళ్ళయిం తర్వాత ఆ కూజాలను బైదులు కిచ్చి రుషీకేష్‌కు పంపి వాటిలోని జలాన్ని రుషీకేష్‌వద్ద గంగా నదిలో కలిపి మళ్ళీ ఆ రెండింటినిండా అక్కడ నీరు పట్టి తెమ్మన్నారు. బైదులు అలా గంగాజలం రుషీకేష్‌లో పట్టి తేగానే ఒక కూజాలోని నీటితో బాబా స్నానం చేశారు. రెండో కూజా మార్చి ఒకటవ తేదీన ప్రారంభించబోయే క్రొత్త పథకం రోజుకు దాచిపెట్టారు.

కేకీ నలావాలా, ఎల్చామిస్త్రీ యిరువురూ అప్పుడప్పుడు బాబాను కలుసుకొనుటకు అనుమతించబడ్డారు డాన్‌కిన్ నడపదల చిన హాస్పిటల్‌ను బాబాయే స్వయంగా ప్రారంభించారు. పొరుగు గ్రామాల నుండి వచ్చే రోగులకు, మురళీని హోమియో వైద్యం చేయమన్నారు.

1సి పథకం ప్రకారం అహ్మదునగర్ తిరిగి వెళ్ళిన ఆదీజీ, యిన్సూరెన్సు వ్యాపారం మొదలుపెట్టి తన ఖర్చులుపోను కొద్ది

రోజులలోనే ఓ వెయ్యి రూపాయలు మిగిల్చి మిత్రుల ఖర్చుల నిమిత్తం బాబా పేర డెహ్రాడూన్ పంపాడు. అతని వినమ్రతకు, విధేయతకు బాబా సంతోషించి ప్రోత్సాహపరుస్తూ టెలిగ్రాం పంపారు.

## తప్పుకు తగిన ప్రాయశ్చిత్తం

హరిద్వార్‌లో కుంభమేళా జరుగబోతోంది. వేలాది సాధువులు, సన్యాసులు, నంగాలు, బైరాగులు హరిద్వార్ సందర్శించనున్నారు. కుంభమేళా జరిగే ప్రదేశానికి చేరువలో వుండాలని, బాబా తాత్కాలికంగా తమ స్థావరాన్ని హరిద్వార్‌కు 5 కి. మీ. దూరంలో వున్న మోతీచూరుకు మార్చాలని నిశ్చయించారు.

మార్చి 1వ తేదీన వుదయాన్నే ముందుగా నిర్ణయించిన ప్రకారం మిత్రులందరినీ వరుసలో నించోబెట్టి ఒక కత్తెరతో ప్రతివారి నెత్తిమీద జుట్టు కాస్త కాస్త కత్తెర వేశారు. తర్వాత బైదులు తెచ్చివుంచిన గంగాజలం కూజా తీసి ఆ జలంతో బాబా స్నానం చేశారు.

అలా జుట్టు కత్తిరింపుకు, తన స్నానానికి సంబంధించి ఎట్టి వివరణ చెప్పలేదు. ఆ మర్నాడు మిత్రులందరిని కాళ్ళు కడుక్కొని రమ్మన్నారు. ప్రతివారి పాదాలకు వంగి నమస్కరించి వారి మనస్సులనేమైనా తాను కష్టబెట్టివుంటే క్షమించమని

అడిగారు. వారు చేసిన తప్పులన్నిటినీ కూడ తాను క్షమిస్తున్నానని ప్రకటించారు. అంతలో ఒక ముఖ్య ప్రకటన చేశారు.

"నేను తెలిసి, బహిరంగంగా 1949 అక్టోబరు 16, 1950 మార్చి 1వ తేదీల మధ్య ఒక ఘోరమైన పెద్ద తప్పు చేశాను. అంచేత మిత్రులంతా నన్ను తన్నితే భగవంతుడు నన్ను క్షమిస్తాడు." అంటూ తనను తన్నమని శిష్యులను ఆదేశించారు. వెంటనే వారంతా గురువాజ్ఞ పాటించారు. తాను చేసిన ఆ పెద్ద తప్పేమిటో తర్వాత సంవత్సరాల్లోకూడ బాబా ఎప్పుడూ బహిర్గతపరచలేదు.

## కుంభమేళా

అనుకున్న ప్రకారం, మధ్యాహ్నం రైలెక్కి కొద్దిమంది మిత్రులు, పెండూ, ఈరుచ్, బైదుల్, గుస్తాద్‌జీ, మురళీ, అలోబాలతో మోతీచూర్ చేరారు. నీలూ, విష్ణులు, ఆడవాళ్ళకు అండగా కాకాతో పాటు మంజరమాఫీలో వుండిపోయారు. మోతీచూర్‌లో చక్కని భవనం బాబా వుండేందుకు ఏర్పాటు చేశారు. అందులోనే తాటాకుల కప్పుతో ఒక కుటీరం నిర్మించారు. అది ఆయన ఏకాంతవాసం కోసం కేటాయించబడింది.

తన సోదరుడు జాల్‌ను వచ్చి తనతో పాటు మోతీచూర్ వచ్చి వుండమని టెలిగ్రాం పంపారు. అయితే జాల్ రాజాలనని తన అశక్తతను తెలిపాడు. ఇక్కడ జీవితం కొత్తరకంగా తయారైంది ఉదయం టీ పాలతో త్రాగేవారు. మధ్యాహ్నం

పాలు లేని టీ త్రాగేవారు. రోజుకోపూట మాత్రం సామాన్య సాత్వికాహారం తినేవారు.

తన గది బాబాయే శుభ్రం చేసుకొనేవారు. తన దుస్తులు తానే వుతుక్కునేవారు. తన పాత్రలు తానే కడుక్కునేవారు. క్రమ శిక్షణతో కూడిన జీవితం గడుపుతున్నారు.

అసలు ఈ కుంభమేళా గురించిన పురాణగాధ ఒకటున్నది పాల సముద్రాన్ని దేవతలు, దానవులు మందర పర్వతంతో చిలకగా అందుండి 14 అపురూప వస్తువులు బయటకు వచ్చాయట. ఆఖరి దానికి ముందు విషభాండం రాగా దానిని శివుడు మ్రింగి తన కంఠమందుంచుకొని గరళ కంఠుడైనాడట. అన్నిటి కంటే ఆఖరున అమృతభాండం రాగా దేవ దానవులు మాదంటే మాదని పోరాటానికి తలపడ్డారు.

అంతలో ఆ భాండాన్ని పట్టుకున్న వాడు సురాసుర రణ రంగం మధ్యనుండి తప్పించుకొని స్వర్గం వైపు పరుగెత్తాడు. ఆ ఖంగారులో అమృత భాండం నుండి కొన్ని చుక్కలు చిలికి నాశిక్ (గోదావరి), వుజ్జయిని (నర్మద), అలహాబాదు (త్రివేణి) హరిద్వార్ (గంగ) లలోని నదుల వద్దున పడ్డాయి. అందుచేతనే ఆ నాలుగు స్థళాలలోను కుంభమేళా వుత్సవాలు జరుగుతాయి. 12 సంవత్సరములకు ఒకసారి కుంభమేళా, 36 సంవత్సరములకు మహా కుంభమేళా జరుగును.

అందుకే ఆ సందర్భంలో వుత్సవంలో పాల్గొనే వేలాది భక్తులను, సాధువులను, సన్యాసులను, తన అద్వితీయ భౌతిక

రూపంతో ఆశీర్వదించాలని బాబా మోతీచూరు మజిలీ ప్రారంభిం చారు. బాబా తన కార్యక్రమాన్ని హరిద్వార్‌లో మార్చి 15 నుండి ఆరంభించాలనుకున్నారు. కైలాసాశ్రమం, మంగళాశ్రమాలే కాక, కొండల్లో, కోనల్లో, గుహల్లో, పర్ణకుటీరాల్లో వుండే ఎందరో యోగుల్ని సాధువుల్ని సందర్శించి వారికి నమస్కరించుటో పాదస్పర్శ చేయుటో చేశారు. ఆయన శిష్యులు ప్రక్కనే వుండి అన్నీ గమనించేవారు.

## ఘనీ ఆస్తి తగాదా

మోతీచూర్‌లో ఒక వారం గడిపి మళ్ళీ మంజరిమాఫీ వచ్చేశారు. ఘనీ దగ్గరనుండి ఓ పత్త్రం వచ్చింది. లోనావాలా ఆస్తి ఏర్పాటు వాలాలకు వ్రాసి యిచ్చాడు. అయితే అవునని వ్రాసిచ్చిన తరువాత ఆలోచనలోపడి త్వరపడి ఆస్తంతా వ్రాసిచ్చి తన కుటుంబ సభ్యులకు అన్యాయం చేశానేమోనని తటపటాయించాడు. అంత బాబా కలిపించుకొని ఆతని జీవిత కాలం నెలకి 500-00 యిస్తానని చెప్పారు.

అతడు బాబా తనకి నష్టం లేకుండా చేస్తారనుకున్నాడు. బాబా ఘనీని ఎంత మొత్తం ఆస్తి ఏర్పాటువాలాలకు యిస్తున్నావని అడిగారు. రు. 35,000-00 ఆస్తి యిస్తున్నానన్నాడు.

అందుకు విష్ణు కలిపించుకొని ఆ ఆస్తి అంత ఖరీదు చేయదు. అందులో కొంతభాగం తన కొడుకు పేరుతో యిచ్చే

కాడు అన్నాడు. ఆస్తి ఎంత ఖరీదు చేసినాసరే తాను 35,000 ఘనీకి యిచ్చేస్తానని బాబా ఖచ్చితంగా చెప్పారు. ఏర్పాటువాలా లకు యీ మొత్తంతో పనిలేదని, తన యిచ్ఛ ప్రకారం 1950 ఆఖరికి ఆ మొత్తం ఘనీకి యిస్తానని అన్నారు.

ఘనీ తన చిన్ననాటి స్నేహితుడు. అతడు నియమ విరుద్ధంగా ప్రవర్తించినా బాబా క్షమించారు. తన పాత జీవిత శిష్యులందరికీ ఓ సర్క్యులరు పంపమని ఏర్పాటువాలాలకు పుత్తరం వ్రాయించారు. తన పాత జీవితపు భారంగా మిగిలిన ఓ అప్పు తీర్చుటకు శాయశక్తులా సహకరించి రు. 35,000-00 బాకీ తీర్చే ఏర్పాటు చేయమని ఆ సర్క్యులరులో వ్రాయించారు.

మంజరీమాఫీ దొడ్లోవున్న నూతినీరు త్రాగకుండా ఎక్కడి నుంచో తెచ్చుకు త్రాగుతున్నారని, ఆవిధంగా షరతులు వుల్లం ఘించారని నీలూ పిష్టులను మందలించి వారిద్దరి ముక్కులు నేల మీద పెట్టి మూడు సార్లు రాయించారు. తోటి సహచరులు కుమార్ చూస్తుండగా వారి సమక్షంలో బాబా ఈ శిక్ష అమలు చేశారు. ఆయన ఆజ్ఞ పాలించి అవమాన కరమైనప్పటికీ అం దరి ఎదుట బాబా చెప్పినట్లు చేశారు.

డాన్‌కిన్ ఒంట్లో బాగాలేదు. వారం రోజులుగా సుస్తీగా వున్నాడు. అయినా తనకు వప్పగించిన పథకం పూర్తిగా అమలు చేయాలని పట్టుదలతో కృషి చేస్తున్నాడు. ఒక్కడూ పూయి కాని వూళ్ళో పరాయి దేశస్తుడైవుండి అననుకూల పరిస్థితులలో

చాలీ చాలని పెట్టుబడితో ఎన్ని కష్టాలొచ్చినా ఎదుర్కొని తన పనిలో కృషిచేస్తున్నాడు.

రెండు రోజులలో వాతావరణం మారింది. ఆకాశం మబ్బులతోవున్నా చలి విపరీతంగా వుంటోంది. వురుములు, మెరుపులతో ఆకాశం దద్దరిల్లుతోంది. తుఫాను వచ్చేట్టుంది. ఆ పరిస్థితులలోనే స్త్రీలను తీసుకొని మోతీచూరు వెళ్ళారు.

మోతీచూరులో ఒకరోజున అన్నం బాగా వుడకలేదని బాబా వ్యాఖ్యానించారు. అంతలోనే తన వ్యాఖ్యానానికి క్షమాపణ కోరి, ఒక మిత్రునివచ్చి తన రెండు చెవులు పిండమన్నారు. తాను మానవునిగా మారినందుకు మానవులెంత తేలికగా చిన్న విషయాలలో కూడ బయట పడతారో చేసి చూపుతున్నారన్న మాట.

## నైతిక ధర్మం

హరిద్వార్‌లోను కంఖల్‌లోను, సాధువులను, మహాత్ములను కలవడానికి బైదులు, ఈరుచ్, పెండూలను తీసుకువెళ్ళారు వూరంతా నిండివున్న ఆశ్రమాలన్నీ చుట్టి సాయంత్రానికి తమ నివాసానికి చేరారు. అంతా బాగా అలసిపోయారు. కేవలం టీ తప్ప మరేమీ తినలేదు. ఎండవేడిని కూడ లెక్కచేయక ఒక చోటినుండి మరో చోటికి తిరుగుతూ, కాషాయాంబర ధారులైన సాధువులను, యోగులను, సన్యాసులను వేల సంఖ్యలో కలసినట్లు పెండూ తన డైరీలో వ్రాశాడు.

మధ్య మధ్య మంజరీమాఫీ వెళ్ళినా, బాబా హరిద్వార్‌లో కుంభమేళా వుత్సవాలు అయ్యేవరకూ వున్నారు. కాషాయాంబరాలు ధరించిన వారు, పెద్ద పెద్ద గడ్డాలు, మీసాలు పెంచిన వారు నున్నగా గుండు చేయించుకున్నవారు, ఒకరేమిటి, భారతావని వివిధ ప్రాంతాలనుండి కుంభమేళాకు చేరుకున్న ప్రతి వైష్ణవునిని బాబా దాదాపు కలుసుకున్నారన్నమాటే. ప్రక్కన బైదులు రాగా అతని చేతిలో ఒక కర్ర చివర వుంచి, రెండవ చివర తన చేతిలో వుంచుకొని తాను వంగి నమస్కరించదలచిన వ్యక్తి కనిపించగానే, బాబా చేతిలోని కర్రతో బైదులుకు సైగ చేసేవారు. అంత బైదులు ఆ వ్యక్తి వైపుకు దారితీసేవాడు. ఒక్క హరిద్వార్‌లోనేకాక, రుషీకేష్ కూడా సందర్శించారు.

## చంద్రగ్రహణ దర్శనం

అంతలో మార్చి 27న చంద్రగ్రహణం వచ్చింది. అది చాలా అత్యంత ప్రధానమైన రోజు. గ్రహణానికి ముందు, తరువాత, పట్టు-విడుపు స్నానాలు చేస్తారు. ఆ స్నానాల కొరకు ఎందరో సాధువులు, బైరాగులు, బారులుతీరి గంగానది వద్దకు చేరుకుంటుంటే, ఆ తీర్థప్రజ యిసుకవేస్తే రాలనట్లుంది. జనం గుంపులు ఎక్కువైనందున బాబా మోతీచూర్ వదలిరాలేదు.

ఆ సమయంలో బాబా తన గుడ్డలు వుతుక్కొని, వంట పాత్రలు శుభ్రంగా కడుక్కొన్నారు. మర్నాడు ఉదయాన్నే బయలుదేరి చాలా క్యాంపులు సందర్శించారు. నిర్మల అఖడా

అనే తావులో ఒక మహంతు మహాత్ముల, సాధుపురుషుల దర్శన భాగ్యం; వారితో సహవాసం చేసినందున కలిగే ఫలితం గురించి అనర్గళంగా వుపన్యశిస్తుంటే బాబా ఆ వుపన్యాసం వింటూ దాదాపు అరగంట గడిపారు.

వందలాది సాధువులకు వంగి ప్రణామము లాచరించి నందువలన బాబా మెడ, నడుము నొప్పి చేశాయి. కదలలేని స్థితిలో వుండిపోయారు. దానికి తోడు కంటి బాధ ఒకటి. మధ్య మధ్య వుపవాసాలు. వీటన్నిటివలన అరోగ్యం బాగా చెడింది.

ముఖ్యంగా యిది గ్రహణ సమయమైనందున, తాంత్రిక శక్తులు సాధించదలచిన వారు, కొన్ని మంత్రాలను గ్రహణ కాలంలో పఠిస్తారు తాము సాధించిన శక్తులు, పదిలంగా అధిక తర శక్తితో వుండిపోవాలని. అట్టివారు నదిలో మొలబంటి నీటిలో నిలబడి పఠిస్తారు.

ఈ విషయంపై బాబాను "అందులో యధార్థమేమైనా వున్నదా? అలా పఠించినందు వలన నిజంగా శక్తులు అబ్బు తాయా?" అని ప్రశ్నించగా ఆయన యిలా వివరించారు. "శాస్త్రీ యంగా అంగీకరించబడే సత్యమేమంటే వినీల నీలాకాశంలో అనంతమైన గ్రహాలున్నాయి. ఎన్నో నక్షత్ర మండలాలున్నాయి. సహజంగా అవన్నీ యీ భూ మండలంపై జీవించే ప్రాణులపై కొంత ప్రభావం చూపుతవి. మరి మనముండే యీ భూమి అత్యున్నత దశలో పరిణామం చెందిన జీవజాలము కలిగి వున్నం

దున ఇందలి మానవుడు ఆధ్యాత్మిక భూమికలకు అతి చేరువగా వుంటున్నాడు.

అందుచేత గ్రహణము యొక్క దృశ్యం ఆధ్యాత్మికరీత్యా పరోక్షంగా యీ ప్రపంచాన్ని ఎదుర్కొంటుంది. పూర్వకాల పురుషులు అలా సంభవించే సంఘటనల ఫలితం, దానివలన కలిగే ఆధ్యాత్మిక లాభం గురించి బాగా ఎరిగి యున్నారు. ఆనాటి ఋషులు ఆ సమయంలో వున్న సామాన్య మానవుల మానవ స్వభావం బాగా ఎరిగియున్నందున ఆధ్యాత్మిక పరమైన ఆజ్ఞ యివ్వక కేవలం ప్రార్థనలు చేయమని, మంత్రాలు పఠించమని, తపోనిష్టతో గడపమని ఆజ్ఞాపించారు. మరి ఏకాగ్రతతో ధ్యానం చేస్తే ఏ కొద్ది ప్రార్థనలైనా, సూర్య, చంద్ర గ్రహణ సంవ ర్భంలో చేసినప్పుడు ఆధ్యాత్మికంగా కొంతవరకు సత్ఫలితాలిచ్చు ననుటను తిరస్కరించలేము'' అని చెప్పారు.

కాషాయాంబర ధారుల్ని దర్శించి, ప్రణామము లాచరించుటలో బాబా చర్యల ప్రధానోద్దేశ్యం, ఆయన ప్రేమమయ సమక్షం, పవిత్రమైన పర్శల ప్రభావంచేత తన అద్వితీయ ప్రకాశాన్ని వారిలో ప్రసరింపచేసి అంతరంగిక మేల్కొలుపు కావించి దైవాన్వేషణలో గడిపే వారి నిజ జీవితంలో స్వార్థరహిత సేవ అలవడి నిష్కలంక జీవితం గడుపుటకు సహాయపడ్డారు.

## వైవిధ్యం - సొగసు

మంజరీమాఫీలో మురళీఅధ్వర్యంలో రాజా అనే ఇంగ్లీషు ఎద్దు సాకబడుతోంది. అది చిన్న దూడగా వున్నప్పుడు సరోష్

కొని తీసుకువచ్చి బాబాకు వప్పగిస్తే సీసాతో పాలు పట్టి ఆయన దానిని పెంచారు. రాజా అని పేరు పెట్టారు. ఆ ఎద్దు క్యారవాన్‌తో పాటు అహ్మదునగరు నుండి తేబడింది.

బాబాకు రాజా అంటే మక్కువ. ఒక్కోసారి దానికి మేత ఆయనే స్వయంగా వేసేవారు మోతీచూర్ వెళ్ళేందుకు రాజా బండి కట్టించుకొని వెళ్ళమని మిత్రులు కోరేవారు అందుకు బాబా రాజాకు కొంత వ్యాయామం వుంటే మంచిదనుకున్నారు. అందుకని రాజా బండి కట్టుకొని హరిద్వార్ వెళ్ళి పచ్చగడ్డి కొని తీసుకురమ్మని, మురళీకి పురమాయించారు. అంతేకానీ తాను రాజా లాగే బండి ఎక్కి వెళ్ళనన్నారు.

రోజూ మురళి రాజాను బండికి కట్టి హరిద్వార్, మోతీచూర్‌ల మధ్య తిరుగుతున్నాడు. ఒకరోజున మోతీచూర్ తిరిగి వస్తుండగా వెనుకనుండి ఓ కారు హారను కొట్టుతూ వెంబడించింది. రాజా నెమరువేస్తూ రోడ్డుకడ్డంగా అడుగులేస్తోంది. కారు తప్పుకునేందుకు ఇరుకుగా వుంది.

రోడ్డు చాల ఇరుకుగా వుంది. కారు డ్రైవరు ఆగకుండా హారను మ్రోగిస్తున్నాడు. బండి ఎద్దు త్రాళ్ళు పట్టుకొని తోలుతున్న మురళీమీద ఆ డ్రైవరుకు విపరీతమైన కోపం వచ్చింది. చివరగా కారు బండిని దాటింది. ఆ కారును తోలే ఒక బ్రిటీషు అధికారి కొంచం ముందుకు వెళ్ళి బండిముందు ఆపి పక్కకు తొలిగి దారి యివ్వలేదని మురళిపై దబాయించాడు. దానిమీద మురళి సౌమ్యంగా జవాబిస్తూ "క్షమించండి! అది నా తప్పుకాదు.

నేను చేతనయినంత ప్రయత్నించాను. కానీ ఆ ఎద్దు నా భాషను అర్థం చేసుకోలేదు. బహుశః అది మిమ్ములను సరిగా అర్థం చేసుకోగలదేమో! అది ఓ ఇంగ్లీషు ఎద్దు!" అన్నాడు. రాజా యొక్క మూగ భాష, మురళి యొక్క చతురోక్తి ఆ ఆంగ్లేయుడిని శాంత పరుచుటే కాక, కడుపుబ్బ నవ్వించాయి. పై పెచ్చు కారు ప్రక్కకు తీసి కాసేపాగి రాజాను గురించి ఎన్నో ప్రశ్నలు వేసి మురళితో కులాసాగా కబుర్లాడాడు.

ఆ సాయంత్రం, వుదయం జరిగిన వుదంతం బాబా విని నవ్వుకున్నారు. సంభాషణంతా అయింతర్వాత రాజాని ఎవరికైనా సరే ఎట్టి షరతులు లేకుండా వుచితంగా ఇచ్చేయమని ఆజ్ఞాపించారు. బాబా ఆజ్ఞల మేరకు పెండూ రాజాను తోలుకెళ్ళి డెహెరాడూన్‌లోనే "పశులోకం" అనే పేర నడుపుతున్న ఒక గోశాలకు బహుమతిగా వప్పగించాడు. ఈ పశులోకమును (గోశాల) సోదరి మణిబెన్ (మహాత్మాగాంధి శిష్యురాలు) నడుపుతూ వుండేది. ఆమెతో సంప్రదించి ఆ గోశాలకు రాజాను వప్పగించారు.

## ప్రసాదం విలువ

కుంభమేళా సందర్భంగా హరిద్వార్‌లో బాబా కొన్ని వేలమంది సాధు పుంగవుల పాదాభివందనం చేసుకున్నారని తెలుసుకున్నాము కదా! ఆ వుత్సవ సమయంలో ఎన్నో ఆశ్రమాలను దర్శించారు. అలాంటి సందర్భాలలో ఒకానొక ఆశ్రమంలో

ఒక మహాత్మునికి పాదాభివందనం చేశారు. అంతనా మహా త్ముడు (సాధుపుంగవుడు) బాబాకు ప్రసాదం పెట్టచూపాడు. మామూలు అలవాటుగా బాబా ప్రసాదం తీసుకొనకుండా వెను తిరిగాడు.

ఆ రోజు కార్యక్రమం పూర్తికాగానే బాబా మోతీచూర్ బయలుదేరారు. దారిలో శిష్యులతో "ఈ రోజు నేను పెద్ద తప్పు చేశాను. ఆ మహంతు ఇవ్వచూపిన ప్రసాదం నేను ఆ వెంటనే తీసుకొని వుండవలసింది." అన్నారు. అందుకు ఈరుచ్ "నేనూ అలాగే అనుకున్నాను బాబా! నవజీవనం రీత్యా మీరా ప్రసాదం అంగీకరిస్తే బాగుండేది."

"అయితే! ఈరుచ్, నీవిప్పుడు మళ్ళీవెళ్ళి ఆ ఆశ్రమాన్ని గుర్తించగలవా? ఆ మహంతును కలసి రాగలవా?" "ఓ! తప్పక వెళ్ళిరాగలను" అని చెప్పి ఎలాగో కష్టపడి వెతికి ఆ మహంతును కనుగొన్నాడు. తన అగ్రజుని బదులుగా తానే క్షమాపణకోరాడు. వుదయం ప్రసాదం తిరస్కరించినందుకు క్షమాపణ కోరాడు. అందుకా మహంతు సంతోషించి మళ్ళీ ప్రసాదం అందించాడు. ఆ ప్రసాదాన్ని బాబా కందించగా ఆ దివ్య సనాతనుడా ప్రసా దాన్ని శిష్యులందరికీ పంచిపెట్టారు.

## కాకి శకునం

హిందువులలో ఒక నమ్మకం వుంది. కాకి మిధునం, మైధునం చేయుట ఎవరైనా చూస్తే వారి సన్నిహితుల మరణ

వార్త వినవలసి వుంటుంది అని. ఒకసారి హరిద్వార్ వెళుతుం డగా బాబా ప్రక్కన నలుగురు శిష్యులున్నారు. వారిలో ఒకరు దారిలో ఒక కాకి జంట కలియుట చూచాడు మనసులో అతడు "అయ్యో! నేడేదో మరణ వార్త వినవలసి వచ్చిందే?" అనుకొని కలత చెందాడు.

బాబా సర్వజ్ఞుడు. అతడి మనసులోని కలత పసికట్టారు. పక్షులు కూడా మానవుల వలెనే సెక్సుపరమైన లైంగిక వాంఛను తీర్చుకుంటాయని, నిరంతరం లైంగిక వాంఛలకు లోలుడైన మానవుడు నోరులేని పక్షులు అలా కలిసి లైంగిక పరమైన కోరిక తీర్చుకొంటే అది చూచుట దుశ్శకునమని మానవుడు ఆరోపించుట ఎంతటి మూర్ఖత్వమో తెలియ చెప్పాలనుకున్నారు.

నవజీవనంలో బాబా సామాన్య అన్వేషకుడు. అయినా ఆయనలో సర్వజ్ఞత్వం దాచాలన్నా దాగేది కాదు. అజ్ఞానపరంగా మనలో దాగివున్న అనేక పురాతన ఛాందస భావాల్ని రూపుమాపేందుకాయన శతధా ప్రయత్నించాడు. అందుకే ఈ కాకి మైధున సంఘటనలో మనలోని మూఢ నమ్మకాన్ని వమ్ముచేయాలని సంకల్పించారు.

కాకి మైధునం చూచిన శిష్యుడుతో "యిప్పుడు మనం ఒక యదార్ధ మరణవార్త వినకుండా వుండాలంటే ఒకపని చేస్తే బాగుంటుంది. అతిప్రియమైన వారి మరణ వార్త కదా వినవలసినది. నీకు అత్యంత ప్రియమైన వాడిని నేనే కనుక ఈ నవ జీవన కార్యక్రమాలతో సన్నిహిత సంబంధం వున్న వ్యక్తి ఒక

ఠికి నేనే మరణించినట్లు వెంటనే ఒక టెలిగ్రాం పంపండి!" అని సలహా చెప్పారు.

ఆ మాట విన్న శారుచ్ వెంటనే కల్పించుకొని అలాంటి వార్త వింటే అది బాంబులా పేలుతుంది. ఆ వ్యక్తి వెంటనే నగరులోని అందరికి వార్త అందిస్తాడు. ఆయనేమో బాబా ప్రేమికులు, శిష్యులందరికి దేశదేశాలు పంపిస్తాడు. నానా అల్లకల్లోలం జరిగిపోతుంది. అందువలన బాబా పేరు వాడరాదు" అన్నాడు.

తుదకు కొంత వాదోప వాదాలు జరిగిం తర్వాత పెండూ మరణించినట్లు తంతి పంపుటకు అంతా ఏకగ్రీవంగా నిర్ణయించారు. మరణవార్త తెలిపే తంతి పంపిన మరుక్షణమే మరో తంతిలో అతని క్షేమవార్త కూడా పంపమని బాబా ఆదేశించారు. చూడండి! మరణమే లేని ఏకైకుడు ఒకరి మరణం గూర్చిన విషయమై ముచ్చటిస్తున్నాడు.

బాబా ఆజ్ఞమేరకు పెండూ మరణించినట్లుగా ఢిల్లీలోవున్న ఓ బాబా ప్రేమికునికి హరిద్వార్ నుంచి పంపారు. వెంటనే అతడు క్షేమంగా వున్నాడని మరో తంతి కూడా పంపారు. అయితే ఆశ్చర్యం! పెండూ క్షేమంగా వున్నాడన్న తంతి ముందు అంది అతడు మరణించినట్లిచ్చిన తంతి తర్వాత అందింది. ఆ రెండు తంతులు అందుకున్న ఆ కుటుంబం కంగారు పడక, కడుపుబ్బ నవ్వుకున్నారు. బాబా యీ సంఘటనద్వారా యిట్టి శకునాలు పట్టి మూఢత్వం అన్న సత్యాన్ని ఋనకందించారు.

# జిహ్వా చాపల్యం

బాబా హరిద్వార్‌లో గడిపే సమయంలో మంజరమాఫీలో వున్న స్త్రీలు తదితర మిత్రులకు సహాయంగా ఆలోబా వుండే వాడు. అయితే అతడు అనారోగ్యంతో బాధపడుతుంటే ఎవరైనా ఒక మంచి కుర్రవాడ్ని యింటి కాపలాకు, వంటకు వుపయోగ పడేందుకు ఏర్పాటు చేయమని కుమార్‌కు పురమాయించారు.

కుమార్ సత్పాల్ అనే కుర్రవాణ్ణి కుదిర్చాడు. ఆ కుర్ర వాడు తన పని సక్రమంగా చేసుకొనే వినయశీలి. యింటి కాపలా తోపాటు రాత్రిళ్ళు వంట తయారుచేసేవాడు. వంట అంటే పప్పూ, అన్నం. కేవలం శాకాహారం. సరియగు పోషక పదార్థాలేమీ వుండేవి కావు. అందుకని ఈ కుర్రాడు అన్నంలో ఓ గరిట నెయ్యన్నావుంటే కాస్త మంచి ఆహారమనిపించుకుం టుందని సలహా చెప్పాడు. అతడి సలహాను బాబా అనుమతిం చారు. మర్నాడు మిత్రులో టిన్నుతో నెయ్యి కొని యింటికి చేర్చారు.

మొదటి సాయంత్రం సత్పాల్ అందరికీ తలా గరిట నెయ్యి వడ్డించాడు. ఘుమ ఘుమలాడే వాసనతోపాటు కాస్త బలంకూడా వుంటుందని మిత్రులంతా సంబరపడ్డారు. భోజన సమయంలో వారు పడే సంబరం చూసి బాబా నవ్వుకున్నారు. కుర్రాడితో “నేతి డబ్బా జాగ్రత్త సుమా!” అని హెచ్చరించారు.

మర్నాడు సాయంత్రం అంతా ఆశ్చర్యపడేట్టు నెయ్యి వడ్డించబడలేదు. బాబా నెయ్యి వేయవందుకు ఆరా తీశారు. ఏడుస్తూ ఆ కుర్రాడు డబ్బాలో నేయి లేదు అని చెప్పాడు. ఏమైందని అడగగా "ఓ పూర కుక్క నేయి వాసన పశిగట్టి వంటింట్లో దూరి నేతి డబ్బాను నోట కరచుకు పోయింది. డబ్బా మూత తీసే ప్రయత్నంలో ఆ కుక్క డబ్బాను నేలపై కొట్టగా ఎండ వేడిమికి లోనున్న నెయ్యి కరిగి కాస్త కాస్త బయటకు రాగా నాకేశింది." అని చెప్పాడు.

## జ్ఞానోదయం

నవజీవనంలో అసౌకర్యాలు కలగకుండా తప్పించుకోవాలంటే కుదిరేది కాదు. నేతి కథ జరిగాక సత్పాల్‌కు మిత్ర బృందం మీద జాలి మరీ ఎక్కువైంది, పగలంతా కష్టపడి పాపం కడు దూరం వడిచేవారు. అంత శ్రమను ఎదుర్కొంటున్న వారు పుష్టికర ఆహారం తీసుకోపోతే నీరసపడి పోతారని జాలిపడి పోయాడు. అయితే ఏం పెడితే బాగుంటుందో సలహా చెప్పుటకు ధైర్యం చేయలేకపోయాడు.

నేతి విషయం మళ్ళీ చెప్పాలంటే భయపడిపోయాడు. టీలో కనీసం పాలైనా కలపరనితెలుసు. ఏ పళ్ళో ఫలాలో చెప్పాలనుకున్నాడు కానీ, ఆహారంలో ఎటువంటి మార్పు చేయ వీలు లేదన్న షరతుకు అతడు కట్టుబడవలసి వచ్చింది. అందుకని

సత్పాల్ రోజూ వండే ఆహారమే ఏ మార్పు చేయకండా బలవర్ధక ఆహారంగా తయారు చేయాలని సంకల్పించాడు.

పప్పును కొత్త తరహాగా వండాడు. అంతా బాగుందని లొట్టలు వేసుకుంటూ తిన్నారు. కొద్ది గంటలు జరగగానే పప్పు తిన్న ప్రతివారూ, కడుపులో మెలి త్రిప్పుతున్నదంటూ వుండగానే విరోచనాలు మొదలయ్యాయి. వాళ్ళు అప్పటికి తాము తిన్న అన్నంలో ఏదో తప్పు జరిగిందని గ్రహించారు.

సత్పాల్‌ని నిలదీసేసరికి పాపం అతను చేసింది చెప్పాడు. పప్పు కమ్మగా వుండాలని దానికి తోడు కాస్త పుష్టిగా కూడ వుండాలనే తలంపుతో తెల్లాముదంతో పప్పు శుభ్రంగా తడిపి వండానని చెప్పాడు. అలా చేసినందున పప్పైతే రుచిగా కుదిరిందే కాని, విరోచనకారిగా పనిచేసింది. అందుకే సత్పాల్ మరెన్నడూ తాను వండే ఆహారాన్ని మార్చాలని ప్రయత్నించలేదు.

## కీలక పాత్ర

ఏప్రియల్ నాల్గవ తేదీకి మోతీచూర్ మకాంలో దాదాపు 10 వేల మంది సాధువుల దర్శనం పూర్తి చేసుకొని బాబా తన మిత్రులతో కలసి మంజిరమాఫీ వెళ్ళిపోయారు. బాబా ఆరోగ్యం చెడిపోయింది. జ్వరం కూడ ఆరంభించింది. వర్షా కాలం మొదలైంది. అధిక వర్షాల మూలంగా మంజరీమాఫీ పరిసరాలన్నీ జలమయమైనాయి.

కుమార్‌ని పిలిపించి వర్షాకాలంలో అక్కడ వుండుటకుగల అవకాశాల్ని గురించి చర్చించారు. వీరి చర్చలననుసరించి మిత్రులు తమ స్థావరం త్వరలో మారనున్నదని వూహించారు. ముఖ్యంగా బాబా ఆరోగ్యం గురించి మిత్రులు ఆందోళన చెందారు. డా॥ గోహెర్, డా॥ డాన్‌కిన్, సీలూలతో వ్యాధి నిరోధక చర్యల గురించి చర్చించింది.

పాపమా డాక్టర్లు తాము చేయకలిగినదంతా చేస్తున్నారు. కానీ ఫలితంమాత్రం బాబా చేస్తున్న అంతర్గత ఆధ్యాత్మిక కార్యక్రమంపై ఆధారపడి వున్నది. బాహ్యంగా ప్రయోగించే మందులు అంతర్గతంగా జరుగుతున్న ఆధ్యాత్మిక వేదనను ఎలా తగ్గించగలవు? శిష్యులు కూడా బాబాతో పాటే ఏక భుక్తం చేస్తూ కఠినమైన శిక్షణ పాటించేవారు.

## నూతన ప్రణాళిక మొదలు

మిత్రుల ఆరోగ్య పరిస్థితులేమీ బాగోలేవు. బాబా శారీరకంగా బడలికతో ఆలసట చెందినట్లున్నారు. బాబా తన మిత్రులను భిక్షుక వృత్తి; జిప్సీ జీవనం, లంగోటీ జీవనం ఈ త్రివిధ అంచల నుండి విముక్తి పర్చాలని నిశ్చయించారు. యీ మూడు రకాలను తనకొరకే ప్రత్యేకించుకున్నారు.

ఆన అక్షర ఫలకం మీద మిత్రులతో "మీరు పధకం మూడులో వుండి నియమాలను నూరు పాళ్ళు పాటించారు. అయితే ఆ నియమాలను పాటించుటలో సరిగా అర్థం చేసుకొ

మట అంత తేలికైనదేమీ కాదు. అది మీకూ నాకు మధ్య అగాధాన్ని సృష్టించింది. కనుక నేనీరోజున మీరెవరూ యీ పథకం మూడులో వుండనవుసరం లేదని ప్రకటిస్తున్నాను. నేనొక్కడినే ఈ పథకం మూడులో వుండి ఆ మూడు అంచలను ఆచరిస్తాను, కనుక మీరంతా మరో క్రొత్త పథకంలో చేరాలని మిమ్ములను ఆదేశిస్తున్నాను. మీ జీవితావసరాలకు కావలసింది మీరే సంపాదించుకోవాలి. అందు కవుసరమైన సహాయం నేనే చేస్తాను" అని ప్రకటించారు.

బాబా ఆజ్ఞలకు అందరూ బద్ధులై తమ అంగీకారం తెలిపారు. డాన్‌కిన్, నీలూ, పెండూ, మురళీలు తనతో సహకరిస్తే తను క్లినిక్ నడుపునానన్నాడు. అందుకు బాబా అంగీకరించలేదు. మంజరీమాఫీలో వుండుటకు తనకు అవకాశ మిక ఎంత మాత్రం లేదని తదుపరి మకాం ఢిల్లీకి మార్చవలచావని చెప్పారు.

ఈ లోగా శిష్యులందరిని మరోసారి హరిద్వార్ తీసుకు వెళ్ళి కుంభమేళాలో పాల్గొనే అవకాశం కల్పించారు. ఈరుచ్‌ని నీలిధారకు పంపించి గంగా జలాన్ని ప్రత్యేకంగా తెప్పించారు. ఆ నీటితో బాబా స్నానం చేసి డా॥ డాన్‌కిన్‌ను ప్రత్యేక ప్రార్థన చేయమన్నారు. ఆ తరువాత మిత్రులందరికి పాదాభివందనం చేశారు. స్నానాలు చేసే ప్రత్యేక సమయాలు పూర్తికాగానే జన సమ్మర్థం తగ్గింది. బాబా తన మిత్రులతో రైలుపై డెహెరాడూన్ చేరారు.

## లౌకిక విధాన పరిరక్షణ

దెహెరాడూన్ నుండి మంజరీమాఫీ చేరగానే బాబాకు విష్ణు తల్లి మరణవార్త అందింది. ఆ వార్త విష్ణుకు అందించు టకు బాబా ఎలా తర్ఫీదు ఇచ్చారో చూడండి! మిత్రులందరినీ పిలచి తమ సన్నిహితు లెవరైనా మరణిస్తే వారెలా స్పందిస్తా రని అడిగారు. అందుకు వారు "బాబా! మేము అటువంటి వార్త వినవలసి వస్తే ఏమీ విచారించక అతి ప్రశాంత చిత్తులమై వుం టామని" అభయమిచ్చారు.

చివరకు విష్ణును పిలిచారు. మెహెరాబాదులో వుంటున్న నీ తల్లి శరీర త్యాగం చేస్తే నీవేమనుకుంటావని అడిగారు. అం దుకు విష్ణు అటువంటి వార్త నన్నేమీ కలవర పెట్టదని బదులి చ్చాడు. ఆ వెంటనే బాబా నగరునుండి డాన్కిన్ పేర వచ్చిన తంతిని బయట పెట్టారు. విష్ణు తల్లి కకుబాయి మరణించింది. బాహ్యంగా విష్ణు ఎటువంటి దుఃఖాన్ని వెల్లడించలేదు. కళ్ళ నీరు పెట్టలేదు. పైపెచ్చు తన విధులు మామూలుగా నిర్వ ర్తించాడు. అతని గుండె ధైర్యానికి, ఓర్పు, సహనానికి బాబా ముగ్ధులై ఆలింగనం చేసుకున్నారు.

## కకుబాయి చరిత్ర

1920 ప్రాంతంలో బాబా పూనా కస్బాపేట కుటీరంలో వుండే రోజులలో కకుబాయి బాబాతో సన్నిహితమైంది. ఆయన

తన మండలి సమకూర్చు కుంటున్న సమయమది. అప్పుడే కకుబాయి కుమారుడు విష్ణును దరి చేర్చుకున్నారు. అతడు బడికి వెళ్ళే చిన్నపిల్లవాడు. ఆయన కిష్టమైన రొట్టెలు కకుబాయితో వండించుకు తినేవారు.

వారింటికి తరచూ వెళుతూ వుండేవారు. ఒకరోజున వాళ్ళింటికి వెళ్ళేసరికి విష్ణు సినిమాకు వెళ్ళాడు. యింట్లోలేడు. విషయం తెలుసుకొని అతడు సినిమా నుండి తిరిగిరాగానే అతని చెంపపై చెళ్ళున బాదారు. బుగ్గలు ఎర్రగా కందాయి. కళ్ళ నీళ్ళు గిర్రున తిరిగాయి. పల్లెత్తు మాట పలకలేదు. మరుక్షణం లోనే బాబా విష్ణుతో మళ్ళీ ఎప్పుడైనా సినిమాకు వెళ్ళ దలిస్తే తన అనుమతి తీసుకుని మాత్రమే వెళ్ళమన్నారు. సినిమా ఖర్చు తన వద్దనే తీసుకు వెళ్ళమన్నారు.

అలా ఆరంభమైన విష్ణు పరిచయం పెరిగి తన చదువు పూర్తి కాగానే బాబా మండలిలో ఒకడుగా చేరి జీవితాంతం ఆయన సేవలో నిమగ్నమైనాడు. తల్లి కకుబాయి కూడ స్త్రీ మండలి సభ్యురాలుగా వుండిపోయింది. విష్ణు తన ఏకైక కుమారుడైనా ఆ ఏకైకునికి సంతోషంగా వప్పగించింది.

బాబా నవజీవనం ఆరంభించుటకు ముందు తన శిష్యులకు ఎలాంటి ఆధ్యాత్మిక తర్ఫీదు యిచ్చేవారో అలాగే నవజీవనంలో కూడ ఇచ్చారు. విష్ణును చిన్నప్పుడు ఎలా చెంపదెబ్బ వేశారో అలాంటి దెబ్బలు, చివాట్లు ఇవన్నీ మండలి బాబాకు బేషరతుగా సమర్పించు కొనుటకు సహాయపడ్డవనుటలో సందేహంలేదు. నవ

జీవనంలో విష్ణు బాబాను అనుసరించుటకు అంగీకరించాడని తెలిసినప్పుడు కకుబాయి ఎంతగానో తపన చెందింది. తన ఏకైక కుమారుని బాబాకు సమర్పణ గావించుకొన్నది. విష్ణు తన తల్లిని గాఢంగా ప్రేమించినా తన సర్వస్వం గురువైన బాబాకు సమర్పించుకొని మనస్ఫూర్తిగా ఆయనకు విధేయుడైనాడు. అంతటి ధీరోదాత్తుడ్ని కన్న తల్లి కబాయి బాబాలో లీనమైంది.

## సద్గురు సన్నిధాన మహిమ

మండలి సభ్యులందరూ సర్వసంగ పరిత్యాగులు. బాబాకు సర్వార్పణ చేసుకున్నారు. వినయ విధేయతలతో ఆయన ఆజ్ఞలు జవదాటక పాటిస్తున్నారు. వారంతా ఒకే లక్ష్యంతో ఆయన మీద కేంద్రీకరించారు. రాత్రనక, పగలనక ఆయనను విడవక అంటి పెట్టుకొని వున్నారు. అయితే వారంత సర్వార్పణ బుద్ధితో విధేయులైనా ప్రాపంచక విషయాలపై వ్యామోహాన్ని భవబంధాల్ని వదిలించుకొనక బాబాతో వున్నందువల వారు పొందే ఆధ్యాత్మిక లాభం శూన్యం. ఈ సత్యాన్ని శిష్యులకు తేటతెల్లమగుటకై బాబా ఒక చక్కని కధ చెప్పారు.

అది ఒక సద్గురువు ఆశ్రమంలో జరిగిన సంఘటన. ఆ సద్గురువుకు చాలా మంది శిష్యులున్నారు. వారంతా సర్వం సమర్పించుకున్న త్యాగధనులు. చాలాకాలం నుండి సద్గురు పదసేవ చేస్తూ ఆయన సన్నిధానంలోనే కాలం గడుపుతున్నారు. విధే

యతతో ఆయన ఆజ్ఞలన్నీ తు. చ. తప్పక పాటిస్తున్నారు. ఎన్నో ఏళ్ళు గడిచాయి. ఒకరోజున వారంతా హతాశులై ఆలోచనలో పడ్డారు. ఇన్నేళ్ళుగా గురువు సన్నిధానంలో గడిపిన ఫలితంగా తాము పొందినది నిష్ఫలమని భావించారు.

ఎవరికి వారు వ్యక్తిగతంగా తాము గురువుతో వున్నందున తమకేదైనా మంచి జరిగిందా? అని ఆశ్చర్యపడ జొచ్చారు. ఒక్కొక్కరే తమకు తాము పరీక్షించుకొని స్పష్టమైన మార్పేమీ జరగలేదని తేల్చుకున్నారు. గురువు సన్నిధికి వచ్చిన రోజున ఎలా వున్నారో, ఇప్పుడూ అలాగే వున్నట్లు అనిపించింది. పురోభివృద్ధి ఏమీ గోచరించలేదు.

ఇటువంటి ఆలోచన శిష్యులలో కలుగగానే వారి అభిరుచి చెడిపోయింది. ప్రవృత్తి మారిపోయింది. దాంతో వారి భావాలు కూడా మారిపోయాయి. వారి నడతలో కూడ మార్పు వచ్చింది. గురువు సర్వజ్ఞుడు. శిష్యుల మనోభావాలు యిట్టే పశికట్టాడు. మర్నాడు శిష్యులను చేర బిలిచి అంతా తెలిసినా తనకేమీ తెలియనట్లు వ్యక్తపరిచారు. "వాతావరణం బాగున్నట్లు లేదు. ఒక్కొక్కప్పుడు వాతావరణం మనోభావాలను చెడగొడుతుంది. మీరంతా చాలా సంవత్సరాలుగా నాతో వుంటున్నారు. మీ సమయమంతా నాతో గడుపుటలోనే సరిపోతోంది. సరదాగా ఎటూ వెళ్ళి కాలక్షేపమన్నా చేయుటలేదు. మీరు కేవలం మానవ మాత్రులు. కనుక అదివిడుపుగా ఒక్కనాడైనా సరదాగా గడుపుట మంచిది. మీకు అలా కాలక్షేపం చేయాలని వున్నదా?" అని ప్రశ్నించారు.

శిష్యులందరి ముఖాలు కళకళ లాడాయి. వారి కోరికదే! "మాకందరికీ యిష్టమే!" అన్నారు అంతా. "అయితే ఒక రోజంతా సరదాగా గడపండి. రోజంతా గడపట మంటే, ఆ రోజంతా ఆనందంగా అనుభవించటం. మీకు నచ్చిన రుచికర పదార్థాలు మస్తుగా తినండి. శాఖాహార, మాంసాహార విచక్షణ లేక ఎవరికిష్టమైనవి వారు తినండి. మధువు త్రాగినా, నాకభ్యం తరం లేదు. నేనేమీ అనుకోను. శుభ్రంగా తాగండి. నేనూ మీతో గడుపుతాను" అన్నారు.

సద్గురువు నోటి వెంట వెలువడే ప్రతి మాట అత్యంత విలువైనది. ఆధ్యాత్మిక మార్పుకు అవి ఎంతో దోహదపడేవి. ఒక నిండు పున్నమి రోజున వారి ఆటవిడుపు రోజుగా సద్గురువు నిర్ణయించాడు. శిష్యులంతా పౌర్ణమి ఎప్పుడు వస్తుందా అని ఎదురు చూశారు. ఆయన వుచ్చరించిన యీ నాలుగు పలుకుల ప్రభావంతో శిష్యులు తమ సమస్త భావాల్ని మరిచారు. వాళ్ళ సందేహాలు, అనుమానాలు, కుశంకలు, వ్యతిరిక్త ఆలోచనలు, ఎన్నేళ్ళుగానో గురువు సాంగత్యం చేసిన ప్రభావంతో పేరుకున్న బాపతు సమస్తం మరిచారు. గురువు కూడా జరగనున్న పరిణామానికి ఆనంద పడ్డాడు.

ఇంతలో శిష్యులు, అవసరమగు తినుబండారాలకు, ఆహార పదార్థాలకు తగు ఏర్పాట్లు చేశారు. తుదకారోజు రానే వచ్చింది. గురువారోజును శిష్యులకు శెలవు దినమన్నారు. వారంతా ఆశ్రమానికి దూరంగా విశాలమైన నదీ తీరం చేరారు.

హాయిగా విశ్రాంతి గొలిపే తరు ఛాయల్లో అంతా కులాసాగా కాలక్షేపం చేస్తున్నారు. గురువు శిష్యులకు మంచి సహకారం యిచ్చారు. దగ్గరుండి స్వయంగా తినిపించారు. మధువుస్వయంగా పంచిపెట్టారు.

తనివితీరా తాగి యిష్టమైన పదార్థాలు భుజించి గురువును శ్లాఘిస్తూ కీర్తనలు పాడారు. పాటలు పాడుకుంటూ, ఆటలు ఆడుకుంటూ అనేక గంటలు గడిపారు. అప్పటికి చీకటి పడింది. బాగా మధువు సేవించి నందున కొంత మత్తుగా వుంది. చీకటి పడబోతుండగా గురువు మరికాస్త మధువు త్రాగించాడు. పున్నమి వెన్నెల పట్టపగలుగా వుంది. ప్రక్కనే వున్న నదిలో బోటు షికారు చేయాలని సంకల్పించారు. గురువు కూడ ప్రోద్బలం చేశాడు.

శిష్యులంతా గురువుతోపాటు గ్రామఫోను, తినుబండారాలు మధు పాత్రలతో బోటు నధిరోహించారు. గురువు కొందరు శిష్యులను తెడ్లు వేయమన్నారు. కొందరు పడవ నడిచే ఏర్పాటు చూస్తుంటే, మరి కొందరు గురువు దగ్గర వుండిపోయారు. ఇతరులు ఆహారం పంచిపెడుతున్నారు. మిగిలినవారు ఆడుతూ, పాడుతూ నృత్యం చేస్తున్నారు. ఆ రాత్రంతా శిష్యులు సరదాగా గడిపారు. చివరకు తెల్లవార వచ్చింది. గురువు చప్పట్లు చరచి యిప్పుడు మనం వెళ్ళిపోయే సమయ మైందన్నారు.

ఆ చప్పట్లతో శిష్యులకు జ్ఞానోదయమైంది. ఆ సమయానికి వారెలాంటి అభివృద్ధి సాధించ లేదని తెలుసుకున్నారు. వారె

క్కడ నుండి బయలు దేరారో అక్కడే వున్నారు. పడవకు ఆధ్వర్యం వహించినవారు పడవను లంగరు నుండి వేరుచేయ లేదు. అందువలన వారు బయలుదేరిన చోటునే వుండిపోయారు. కానీ గురువు మాత్రం ఆరోజంతా వారితోనే వున్నారు.

ఆయన హితుడు, ప్రియతముడు కనుక అసలు జరిగిందేమిటో విడమర్చి విశదపరుస్తున్నాడు. "యింతకు ముందు మీ మనసుల్లో ఏవేవో భావాలు చిగిర్చాయి. ఆ నాడు వాతావరణం బాగా లేదన్నాను. నా సూచనకు మీరెవరూ సరియగు వివరణ యిచ్చుటకు కనీసం ఆలోచించలేదు. ఈనాడు, రాత్రి పగలు మీరంతా పూర్తిగా గడిపి ఆనందించారు. ఇదంతా చాలా బాగుంది. ఆ సమయంలో నేను మీతోనే వున్నాను. నేను మీ నుండి వేరుపడలేదు. కానీ మీరునాతో వుండుట లెక్కలోనిదికాదని గ్రహించితిరా? నేను మిమ్మల నొక్కరోజు విడిగా గడపమని ఎందుకాదేశించాను? మీరింక ప్రాపంచిక సుఖ భోగాలు వదిలించుకో లేదన్న మాట. అందుకే మీరు నాతో వున్నప్పటికీ మీరెక్కిన పడవను లంగరు నుండి వేరుచేయుట మరచారు."
యిందులో సంపూర్ణ విధేయతా భావంతో పాటు, సద్గురు సన్నిధానంలో మనోభావాలకు విలువ వుండదు.

## ప్రేమ ప్రాముఖ్యం

దైవ మానవుని ప్రేమించుట ప్రధానం. ఆయనను ప్రేమిస్తే ఆయన సాన్నిధ్యంలో వున్నట్లే. మహ్మదు ప్రవక్త

బోధలలో ఒక సంఘటన వున్నది. మహమ్మదు బోధలకు చలించిన ఒక అన్వేషకుడు ఆయన వెంతకు వచ్చి తనతో శాశ్వతంగా వుండిపోదలచినట్లు చెప్పాడు. అతడు "యెమెన్" నుండివచ్చాడు.

అతని అభిప్రాయం విన్న మహ్మద్ "ఓ అన్వేషకుడా నీవు నన్ను నిజంగా ప్రేమిస్తే నీవు నానుండి దూరంగా ఎక్కడో ఎమెన్‌లో వున్నా నిజానికి నీవు నాతో అత్యంత సన్నిహితంగా వున్నట్లే సుమా! మరి నీవు నన్ను ప్రేమించుటలో, నాకు చూపే విధేయతలో, విజయుడవు కానప్పుడు నీవు నా సన్నిధానంలో వున్నా నిష్ఫలమే! అది నీవు ఎమెన్‌కన్నా యింకా సుదూరతీరాల్లో వున్నట్లే!"

కనుక దైవ మానవునితో సహజీవనం గడపాలని ఆయన సమక్షంలో వుండాలని తీక్షణ వుండటం అవసరమే! అయితే అట్టిఆకాంక్ష ఆయన ఇచ్ఛకు వ్యతిరేకంగా వుండకూడదు. మనల్ని ఆయన బోధల కనుగుణ్యంగా ఆయనను ప్రేమించమన్నారు. ఆయనకు విధేయులు కమ్మన్నారు.

బాబా మంజరీమాఫీ నుండి మకాం ఎత్తివేయాలని పథకాలు తయారు చేస్తున్నారు, అంతలో గుస్తాద్‌జీ బంధువు "రుస్తుం ఎస్. హన్‌స్పేటియా" అనేఆయన బాబానువెతుక్కుంటూ వచ్చాడు. ఆయన రైల్వేలో వుద్యోగం చేసేవాడు. నవజీవన సర్క్యులరులు చదివాక ఆయనకూడ బాబాతో వుండి నవజీవనం కొనసాగించాలని నిశ్చయించుకున్నాడు. తన నిర్ణయాన్ని వాళ్ళ నాన్నగారితో చెప్పగా అందుకాయన నప్పుకోలేదు. అయినా

రుస్తుం అప్పటికే తన వుద్యోగానికి రాజీనామా యిచ్చి వున్నం దున బాబా ఎక్కడ వున్నారోనని వెదుక్కుంటూ యిల్లు వదలి బయలు దేరాడు.

హరిద్వార్, మోతీచూర్‌లలో వెదకి చివరగా మంజరీ మాఫీ వచ్చాడు. ముందుగా పెండూను కలిశాడు. నవజీవనంలో బాబా ఎవరినీ దర్శించరని చెప్పాడు. అందుకు రుస్తుం తాను బాబాకు సంపూర్ణ విధేయుడ్నని ఆయన ఏమి చెప్పినా ఆజ్ఞగా పాలిస్తానని చెప్పాడు. ఒక్క విషయంలో మాత్రం భయపడుతు న్నానన్నాడు. బాబా తిరిగి వెళ్ళిపొమ్మంటే మాత్రం తన అశక్తతను వెలిబుచ్చాడు. ఎట్టి పరిస్థితులలోనైనా తాను బాబాతో వుండిపోవాలని స్థిరంగా నిశ్చయించుకున్నానని చెప్పాడు.

మొత్తానికి పెండూ బాబాతో రస్తుం రాక గురించి చెప్పాడు. నవజీవనంలో నూతన ప్రణాళిక అమలుపరచబోతు న్నందున క్రొత్త అధ్యాయం ప్రారంభం కాబోతున్నది. కనుక యి సందర్శకుని తన యింటికి తిరిగివెళ్ళి తుది నిర్ణయం ప్రకటించే వరకు ఆగమని చెప్పమన్నారు. తన మిత్రులతో చర్చించిన తర్వాత వుత్తరం వ్రాస్తామని చెప్పమన్నారు.

పెండూ ద్వారా బాబా నిర్ణయం తెలిసిన రుస్తుం కనీసం బాబా దర్శనమన్నా యిప్పించమని ప్రాధేయపడ్డాడు. అది వీలు పడదని ఎంత చెప్పినా దర్శనం కోసం తపించిపోయాడు. రుస్తుం కోరిక తీరేందుకు బాబా అంగీకరించి రోడ్డు రెండోవైపున వుండి వెనుకగా దర్శనం చేసుకోమని అనుమతిచ్చారు. బాబా గదికి

కొంచం దూరమే అయినా రుస్తుం సంతోషాతిరేకంతో కళ్ళల్లో ఆనందభాష్పాలు జాలువారుచుండగా బాబా దివ్యమంగళ రూపాన్ని తనివితీరా దర్శించుకొని హృదయ భారంతో తిరిగివెళ్ళిపోయాడు.

రుస్తుం వున్న కారణంచేత దాదాపు అయిదు గంటలపాటు బాబా పురుషులు క్వార్టరుకు వెళ్ళలేదు. ఈ సమావేశం అయిన తర్వాత 15 రోజులకు రుస్తుంకు జాబు పంపారు. తాను బాబా చెంతకు రావద్దని తనువున్నచోటే నవజీవన నియమాలు పాటిస్తూ జీవించుటకు అనుమతింప బడినట్లు వ్రాశారు. బాబాను స్వయంగా చూడరాదని, ఎట్టి వుత్తర ప్రత్యుత్తరాలు జరపరాదని షరతు విధించారు. ప్రేమ, విధేయతల కిది పరీక్ష కదా!

## నైతిక ధర్మం

మిత్రులతో యదేచ్ఛగా నూతన పథకం గురించి చర్చించారు. ఎవరి అభిప్రాయాలు వారు నిర్మొహమాటంగా వెలిబుచ్చారు. వినయంతో వెలిబుచ్చిన అందరి అభిప్రాయాలు బాబా మౌనంగా విన్నారు. తుదకు తన అంత్య నిర్ణయానికై కొద్ది రోజులాగమన్నారు. ఈరుచ్‌ని ఢిల్లీ వెళ్ళి అక్కడ మిత్రులు నేతి వ్యాపారం చేసేందుకు అనువగు పరిస్థితులు తెలుసుకు రమ్మన్నారు.

కొత్తగా వాన నీరు రావడం చేత, వాతావరణం మారటంతో అందరి ఆరోగ్యాలు బాగా క్షీణించాయి. నూతి నీరు త్రాగటానికి పనికిరానందున అరమైలు దూరం నుండి తేవలసి

వస్తోంది. విష్ణుకు జ్వరం వచ్చినా పనులు తప్పుటలేదు. సైకిలు వేసుకొని డెహెరాడూన్ వెళ్ళి మార్కెట్టు చేసుకు వస్తున్నాడు. వాళ్ళ ఆరోగ్యాలు ఎంత క్షీణించినా తమకు నిర్ణయించిన విధులు, విధేయతలో నెరవేరుస్తున్నారు. బాబా బెల్గాంలో శిక్షణా కార్యక్రమం ప్రారంభించినప్పుడు కూర్ల బుట్ట తన నెత్తిపై మోసుకొని వంటయింట్లో చేర్చారు. అటువంటిది యిప్పుడు అనారోగ్యంతో బాధపడుతున్నా మిత్రుల విధులలో ఏమాత్రం సడలింపు లివ్వనందున ఇది వారి విధేయతకో పరీక్ష అయింది.

శారీరక శ్రమలెన్ని వున్నా బాబా తన మిత్రులను ఎల్లప్పుడూ సంతోషంగా వుంచేవారు. మధ్య మధ్య ఆటలు ఆడించేవారు. క్రికెట్టు, గిల్లీదండా, (కర్రా బిళ్ళా ఆట) ఆడిస్తూ వాటి వెనుక దాగివున్న ఆధ్యాత్మిక సత్యాన్ని వివరించేవారు.

## నూతన పధకం

ఢిల్లీ వెళ్ళిన యీరుచ్ తిరిగి వచ్చాడు. మళ్ళీ మిత్రులంతా చాలాసార్లు సమావేశమై చివరకు ఒక నిర్ణయం చేశారు.

1బి- పధకంలో 11 మందిమిత్రులుంటారు. వారు, కాకా, గుస్తాద్‌జీ, పెండూ, బైదులు, ఈరుచ్, నీలూ, విష్ణు, మురళి, డాన్‌కిన్, అలోబా, సదాశివపాటిల్, వీరంతాఢిల్లీలోని కేకీ దేశాయి గారింట్లో తమ ముఖ్య కేంద్రస్థానం చేసుకొని, కొత్తగావ్యాపారం ప్రారంభిస్తారు. వారి వ్యాపారానికి ముఖ్య సంధాన కర్త, ఆర్గనైజరు, అలిఘర్ నివాశితో డీసింగ్ తనకున్న పూర్వానుభవంతో

తోడీ సింగు క్రీం సరఫరా చేసుకు వస్తాడు. దానితో మిత్రు లంతా నేతి వ్యాపారం చేస్తారు. సంక్షిప్తంగా నూతన పథకం వివరాలివి.

ఈ వ్యాపారంలోని భాగస్తులంతా నమ్మకంగా వుండి, వ్యాపారం చేసి తమ భుక్తికి సరిపడినంత సంపాదించుకోవాలి. ఒక బృందంగా వారంతా వుండి పనిచేయాలి. వ్యాపారం మొదలు పెట్టుటకు ముందు, పెట్టుబడిగా బాబా కొంతపైకం అప్పుగా యిస్తామన్నారు. అలా పెట్టుబడిగా యిచ్చేందుకవుసర మైన పైకంకొరకు మంజరీ మాఫీలో కొన్న ఆస్తిని అమ్మేయ మన్నారు.

నవజీవనంలో తనతో సంబంధం పెంచుకున్న వ్యక్తులకు అవకాశమిచ్చి వారిని కొన్ని వేల రూపాయలకు మాత్రమే తీసు కోమన్నారు. అందులో ఒక్క నుయ్యి త్రవ్వించడానికే రు. 2000-00లు అయింది. అయితే, పైకం వెంటనే చెల్లించ వలసి వచ్చినందున ఎవరూ ముందుకు రాలేదు. చివరకు డెహరాడూన్ లోని ఒక ఫొటోగ్రాఫరు ఆ ఎస్టేటును కొను క్కున్నాడు.

డాన్‌కిన్ క్లినిక్కు మూసివేయించారు. సామగ్రి అంతా అమ్మేశారు. ఢిల్లీలోని కైన్, హరజీవన్‌లాల్ లకు తాము ఢిల్లీలో బస చేసేందుకనువగు వసతి ఏర్పాటు చేయమని కబురంపారు.

# భిక్షాటనకు స్వస్తి

డా॥ ఘనీ వున్నన్ని రోజులు, నిత్యకృత్యం వ్రాసేవాడు. ఏర్పాటువాలాలకు సహాయపడేందుకు అతడు వెళ్ళిపోయింతర్వాత ఆ పనిని డా॥ నీలూకు వప్పగించారు. యిప్పుడు యీ నూతన పథకం ఆలోచనలు ఆరంభమయ్యాక అతడ్ని డైరీ వ్రాయవద్దన్నారు. డైరీ వ్రాయనందున నవజీవనంలో ముఖ్యమైన సంఘటనలు, తేదీలు వ్రాతపూర్వకంగా లేకుండా పోయినవి.

నూతన పథకం ప్రారంభానికి ముందు అప్పటి వరకు వారు ఆచరిస్తున్న మూడు అంచల జీవనం సమాప్తం కానున్నది. భిక్షాటనకు ఆఖరు తేదీ మే 1వ తేదీగా నిర్ణయించారు. ఆనాడు బాబా ప్రత్యేక భిక్ష చేస్తానన్నారు. ఆనాటి సాయంత్రం 5 గంటలకు మిత్రులంతా తమ మూడు అంచల జీవనానికి స్వస్తి చెపుతారు.

బాబా ఆజ్ఞల మేరకు 1950 మే 1వ తేదీ వుదయం నాలుగు గంటలకే మిత్రులంతా నిద్రలేచారు. కాలకృత్యాలన్నీ పూర్తి చేసుకొని మిత్రులంతా నవజీవన వుడుపులు ధరించారు. తెల్ల కఫ్నీ, పచ్చ తలపాగా, నీలూ, కాకాల సహాయంతో బాబా కూడ కఫ్నీ, తలపాగా ధరించారు. ముందుగానే నాలావాలా, కుమార్‌ల కుటుంబాలు రిస్పానా నదీతీరంలో బాబా బృందానికి భిక్ష ఏర్పాటు చేయాలని నిర్ణయించినందున నవజీవన దుస్తులలో బాబా బృందంతో సూర్యోదయం కాగానే నది ఒడ్డుకు బయలు దేరారు.

కైకోబాదు భార్య ఫ్రీనీ పలావు వండి తేవాలనుకున్నది. భిక్షకు నిర్ణయించిన సమయం వుదయం 7 గంటలు. ఫ్రీనీ వుదయం చీకటితోనే లేచి వంట ప్రారంభించింది. ఆరు గంటల సమయంలో ఫ్రీనీ చూచుకోగా ఇంకా ఫలావు సరిగా వుడకలేదు. అయితే బాబా నిర్ణయించిన కాలాన్ని మీరరాదు. కేకీ, నాలావాలా బాబా చెప్పిన కాలానికి నదీతీరం చేరాలంటే ఫలావు సరిగా వుడకనందున ఆలస్యమౌతుందని భయపడ్డాడు. ఏం చేయాలో తోచలేదు. వుడికీ వుడకని ఫలావు తీసుకొని సమయానికి వెళ్ళి ఆయన ఆజ్ఞ పాలించటమా లేక బాగా వుడికిన తర్వాత వెళ్ళడమా? అని ఆలోచనలో పడ్డారు.

బాబా ఆజ్ఞలు విధేయతతో పాలించుటే తమ ధర్మంగా ఎంచి వుడికీవుడకని ఫలావు తీసుకొని టాంగాలో రీస్పానా నదీ తీరానికి వెళ్ళారు. అంతలో బాబా బృందం కూడ అక్కడకు చేరుకున్నారు. ఆ దివ్య మంగళ స్వరూపాన్ని చూచే సరికి కేకీ దంపతులు వుడకని ఫలావు సంగతి మరిచిపోయారు. దైవ మానవునికి భిక్ష సమర్పించుట తమ అదృష్టంగా ఎంచి అది తమకొక అపూర్వ అవకాశంగా భావించారు.

లాలిత్యంతో కూడిన చూపులతో బాబా తమ ప్రేమను ఆ దంపతుల హృదయముల నిండా నింపేశారు. సౌంజ్ఞ చేసి భిక్ష సిద్ధం చేయమనగానే ఫలావు తీసి బాబాకు, మిత్రులకు భిక్ష సమర్పించారు. ఎంతో ప్రేమతో ఆహారాన్ని బాబా స్వీకరించగా

మిత్రులంతా కూడ కడుపార భుజించారు. భిక్ష తినడం పూర్తి చేసి అంతా మంజరీమాఫీ తిరిగి వెళ్ళిపోయారు.

దారిలో బాబా మిత్రుల్ని మౌనం పాటించమని ఆజ్ఞాపించారు. వాళ్ళ నివాసం చేరగానే అదే తమ ఆఖరి భిక్షగా ప్రకటించారు. ఇకముందు తాము భిక్షాటన చేయునవసరం లేదన్నారు. ఆనాటి భిక్షలో ఫ్రీనీ వండిన పలావును బాబా స్వయంగా మిత్రులందరికీ వడ్డించారు. ఆనాటి సాయంత్రం 5 గంటల నుండి పథకం 3, పథకం 1బిలు నూతన ప్రణాళిక క్రింద అమలు కానున్నవి.

అక్కడ ఫ్రీనీకి యింటికి వెళ్ళాక గాని వుడికీ వుడకని పలావు సంగతి జ్ఞప్తికి రాలేదు. ప్రియతముని సమక్షంలో అంతా మరచిపోయి వుడకని పలావు మాట గుర్తు రాలేదు. తీరా యింటికి వెళ్ళాక దాని సంగతి గుర్తొచ్చి వుడకని వంట పెట్టి అపచారం చేశానని బాధపడసాగింది. మరి కొద్దిరోజులైంతర్వాత బాబాను దర్శించే అవకాశం లభ్యమయింది. ఆ సందర్భంలో ముందుగా బాబాకు క్షమాపణలు చెప్పుకున్నారా దంపతులు. మే 1వ తేదీన వుడకని పలావు పెట్టినందుకు క్షమాపణ కోరారు. అయితే శిష్యులంతా ఆ వుడకన పలావు సంగతేమిటోనని ఆలోచనలో పడ్డారు. ఆనాడు తామంతా ఘుమ ఘుమలాడే చక్కగా వుడికిన పలావు తిన్నట్లు భావించారు. అయితే వుడకని పలావు ఎలా వుడికిందో ఎవరికీ అవగాహన కాలేదు.

# నేతి వ్యాపారం

మే రెండవ వారంలో మిత్రులంతా నేతి వ్యాపారం కోసరం ఢిల్లీ వెళ్లారు. మంజరీమాఫీ ఎస్టేటు అమ్మగా వచ్చిన పైకంలో కొంత నేతి వ్యావారం నిమిత్తం పెట్టుబడిగా యివ్వబడింది. ఢిల్లీలోని 4 హుస్సేన్ భవనం, నికల్సన్ రోడ్డులోని కేకీదేశాయి గారింట్లో శ్రమజీవన ఘట్టం ఆరంభమైంది. తోడీ సింగు రెండు రోజులకోసారి క్రీం క్యానులు పంపుతున్నాడు.

బృందమంతా సమిష్టిగా శ్రమను పంచుకుంటున్నారు. కొందరు రైలు స్టేషనుకు వెళ్ళి క్రీం క్యానులు తెచ్చేవారు. కొందరు ఆ క్రీమును మంచుతో కలిపి చిలికి వెన్న తీసేవారు. మరి కొందరు బొగ్గుల పొయ్యి మీద ఆ వెన్నను కాచేవారు. బాగా కాగి కమ్మని వాసన రాగానే నెయ్యి తయారైనట్లు గ్రహించి పొయ్యి క్రిందకు దించేవారు.

మరికొందరు రకరకాల సైజుల్లో డబ్బాలలో నింపి సీలు చేసేవారు. డబ్బాల మీద నవజీవన నెయ్యి అన్న లేబులు అంటించి అమ్మకానికి సిద్ధం చేసేవారు. ఒక్కొసారి క్రీంలో కల్తీ వుందో, కాయటంలో తేడా వచ్చో వెన్న చెడిపోతే దూధ్ పేడా (స్వీటు) తయారుచేసి ఢిల్లీలోని వీధులెంట, "దూధ్ పేడా, దూధ్ పేడా" లని అమ్ముకొని వచ్చేవారు.

మంచి నెయ్యికి మార్కెట్‌లో గిరాకీవున్నా నష్టంలేకుండా అమ్ముడు పోవటం కష్టమై పోయింది. పాపం మిత్రులకు పెట్టుబడికి మించిన ఖర్చు పెట్టినందున ఢిల్లీ మార్కెట్టులో లాభాలు

ఆశించినంతగా రాలేదు. యితర వ్యాపారులు మంచి నేతిలో కల్తీ కలిపి లాభాలార్జిస్తున్నారు. వీళ్ళేమో కల్తీలేని స్వచ్ఛమైన నేయి మార్కెట్టు రేటుతో పోటీపడి అమ్మలేక పోతున్నారు. ఫలితంగా సరుకు గుట్టలుగా నిలవ వుండిపోయింది.

అంతలో బాబా ఢిల్లీ చేరుకున్నారు. విషయాలన్నీ విన్నారు. తర్వాత ఏంచేయాలనేది చర్చనీయాంశమైంది. వ్యాపారం కొనసాగించాలా? ఎత్తివేయాలా? అనేది సమశ్య. ఇతర వ్యాపారుల మాదిరే కొంత నాశిరకం తెచ్చి కలిపి కల్తీ సరుకుతో మార్కెటు ధరతో పోటీ పడమంటారా? అని డాన్‌కిన్ అడుగగా బాబా "వద్దు వద్దు" అన్నారు. మోసాన్ని ఏ రూపం లోను బాబా ఎన్నడూ అనుమతించరు. అందుచేత ఆ వ్యాపారం ఎత్తివేయాలని సంకల్పించారు.

ఈ నేతి వ్యాపారం శ్రమతోకూడి చెమట పట్టించే భాగం. అందుచేత దీనిని పశీనాయోగం అన్నారు. అదేమాదిరి 1924 ప్రాంతంలో మెహెరాబాదులో తన మండలిని పాత కట్టడాలు పడ గొట్టించి కొత్తవి పునర్నిర్మించుటలో వుపయోగించారు. అప్పుడు వారు పడే శ్రమను గమేలా యోగమన్నారు. అలాగే బాబా మండలివారు తిరగలిపై పిండి విసిరేవారు. దానిని చక్కి యోగ మన్నారు. యోగం అంటే గురువాజ్ఞ పాటించి విధేయతతో నడుచుకోవటం. యధార్థమైన యోగం ప్రియతమునితో సంలీనం.

## ఢిల్లీ షరకాంలో మార్పు

నెయ్యి వ్యాపారం గిట్టుబాటు కానందున పెట్టుబడికి నష్టం రాకండా వున్న సరుకంతా అమ్మేసి, ఆ వ్యాపారాన్ని మాను కున్నారు. ఏర్పాటు వాలాల్లో ఒకరైన జార్కౌరావాలాకు బాబా ఆజ్ఞగా యీరుచ్‌కి జాబు వ్రాశాడు. తాము తమబృందం, వుత్తరాది నుండి దక్షిణాదికి, రానున్నామని, ఒక పర్వతం ఓ నది వున్నమంచి అనువైన పట్టణమేదైనా ఎంపిక చేసి, తామంతా వుండుటకు అనువగు వసతి ఏర్పాట్లు చేయమని వ్రాశాడు.

ముఖ్యంగా సతారా - మహాబలేశ్వరుల సమీపంలో ఏదో ఒక చోటఏర్పాటు చేయమన్నారు. మహాబలేశ్వరం అంటే బాబాకు యిష్టం. రెండవ స్థానం సతారాజాల్‌కు తోడుగా సహాయపడేందుకు ఈరుచ్‌ని కూడా పంపారు. చివరకు సతారాలోనే ఒక బంగళా ఎంపిక చేశాడు ఈరుచ్. జూన్ 15 కల్లా, బాబా బృందం తమ తాత్కాలిక మకాం, సతారాకు తరలించారు. రైలుపై దాదాపు వేయి కిలోమీటర్లుపైగా ప్రయాణం చేసి, అంతా సతారా చేరుకున్నారు. వుత్తరాది నుండి మకాం దక్షిణాదికి మారింది.

## కిట్టీ రానోలు సతారా రాక

నవజీవ నారంభానికి ముందు దేశంలో నెలకొనివున్న రాజకీయ వాతావరణం దృష్ట్యా పాశ్చాత్య వనితలను తమతో భిక్షాటన చేస్తూ తీసుకువెళ్ళుట సబబుగాదని తలచి వారిని బొంబా

యిలో హోమాయిగారింట్లో వుండి ఏదేని ఉద్యోగం చేసి డబ్బు సంపాదించుకోమని, సమయము వచ్చినప్పుడు కబురంపగానే తమను వచ్చి కలువమని ఆదేశించారు.

బాబా ఆజ్ఞ శిరసావహించి మెహెర్జీగారింట్లో వుండిపోయారు. మెహెర్జీ కూతురు పర్వీజు చదువుకొనే సైంటుమేరీ స్కూలులో వుపాధ్యాయినిగా కిట్టీ చేరింది. రానో కూడ అదే హైస్కూల్లో డ్రాయింగు టీచరుగా చేరింది. బాబా పిలుపు కోసం ఎదురు చూస్తూ మెహెర్జీగారింట్లో కాలక్షేపం చేస్తున్నారు.

అంతలో వారిరువురినీ సతారాలో తమతో పాటు ఒక నెల రోజులుండేందుకు రమ్మనమని జాబు వ్రాశారు. అందులో ఓ షరతున్నది. మళ్ళీ తిరిగి వెళ్ళమన్నప్పుడు తమ ఉద్యోగాలలో చేరేందుకు ఏర్పాటు చేసుకొని రమ్మన్నారు. పాపం ఇరువురూ స్కూలు ప్రధానోపాధ్యాయురాలు మిసెస్ గ్రూమ్‌ను ఏలాగో వప్పించి మెహెర్జీ భార్య హోమాయితో చెప్పి ఆఘమేఘాలలో బయలుదేరి సతారా చేరారు. దివ్య ప్రియతముని సన్నిధిలో ఆనందంతో ఓలలాడారు. నవజీవనంలో బాబాతో వుండుట వారికి అరుదైన సంఘటనే కాక అమూల్యమైన అవకాశం.

## మధురక్షణాలు

సతారా చేరగానే బాబా ఖిలోబాను బొంబాయి వెళ్ళిపోయి ఏదైనా వ్యాపారం చేసుకోమన్నారు. అతడు నవజీవన షరతుల ప్రకారం బాబా ఏమి చెప్పిన ఎదురు ప్రశ్నించరాదు కనుక

వెంటనే బొంబాయి వెళ్ళిపోయి ఒక ఇరానీ రెష్టారెంటులో క్యాషి యర్‌గా కుదిరాడు.

కొన్ని నెలలు గడిచిన తర్వాత అలోబా స్వంతంగానే ఒక టీ దుకాణం ప్రారంభించాడు. అది మంచి వుచ్ఛ దశలో నడుస్తోంది. కాతాదారు లెక్కువైనారు. అట్టి సమయంలో టీ షాపు ఎత్తివేసి తనతోపాటు ఫైర్‌ఫ్రీలైఫ్ భారతావని అంతా తిరుగుటకు వచ్చేయమన్నారు. అప్పటి నుండి అలోబా బాబాతో అంతరంగిక మండలి సభ్యుడుగా వుండిపోయాడు. అలోబా అసలు పేరు ఆలీ అక్బరు షాపూర్ జమాన్. అతడొక ఇరానియన్ ముస్లిం.

నవజీవన కాలంలో ముఖ్యంగా వుత్తర భారతంలో హిందూ ముస్లిం విద్వేషాలు చెలరేగుతుండేవి. కాలినడకన బాబా సహచరులు గడిపిన భాగం అధికంగా వుత్తర ప్రదేశంలోనే వున్నది. అక్కడ అధిక శాతం హిందువులు. బాబా సహచరులలో అలోబా డా॥ ఘనీలు మహమ్మదీయులు. హిందువుల నుండి తీవ్ర వ్యతిరేకత ఎదుర్కొనకుండా వుండేందు కనువుగా ఆలీ అక్బరు షాపూర్ జమాన్ పేరు అలోబాగానూ, ఘనీ పేరు ఘనోబాగాను మార్చివేశారు.

వుచ్చారణలో ఇవి రెండు హిందూ పేర్లవలె వుండుటచేత సహచరు లెటువంటి ఇబ్బందులు ఎదుర్కోలేదు. ఘనీ 1951 లో బాబాలో ఐక్యం కాగా, అలోబా ఇప్పటికీ మండలి సభ్యుడుగా

కొనసాగుతున్నాడు. అతని పేరు నేటికీ అలోబాగానే మిగిలి పోయింది.

## మూగ వేదన

సతారాలో బాబా అనుచరవర్గంతో ఘూర్కే బంగళాలో విడిది చేసివున్నారు. ఒకరోజున బంగళాలో సహచరులతో పరివేష్టించి వుండగా దూరాన రోడ్డుపై వంతెనమీద కఫ్నీధరించి కూర్చున్న ఓ వృద్ధుడ్ని బాబా గమనించారు. అతడెవరై వుంటాడా! అనిమిత్రులనడిగారు. ఆ వ్యక్తి వెనక్కి తిరిగి వుండుటచేత అత నెవరో పోల్చుకోలేక పోయారు.

ఆగంతకుడెవరో వెళ్ళి చూచిరమ్మని ఈరుచ్‌ని పంపారు. తీరా వెళ్ళేసరికి అతడు దౌలత్‌సింగ్. ఇరువురూ తలవని తలంపుగా కలుసుకున్నందుకు అమితాశ్చర్యపడ్డారు. ఆనందంలో ఆలింగనం చేసుకున్నారు. తాను బాబాకు విషయం తెలిపి వచ్చేంతవరకు నిరీక్షించమని చెప్పి బాబా దగ్గరకువెళ్ళి విషయం విన్నవించాడు. తానే స్వయంగా భిక్ష పెడతాను రమ్మనమని దౌలత్‌సింగ్‌ను ఆహ్వానించారు.

బాబా పిలుపుతో దౌలత్‌సింగ్ అమితానందంతో ఆనందాశ్రువులు కార్చాడు. జోలె, బొచ్చె సర్దుకొని వడివడిగా తన ప్రియతముని సన్నిధికి చేరాడు. "బాబా భిక్షా దీజియే" అన్నాడు. బాబా స్వయంగా అతని జోలె ఆహారంతో నింపారు. తానంత వరకు భిక్షుక జీవనం గడుపుతూ ఇతరులను భిక్ష వర్ధిస్తూ ఇప్పుడు

తానే మరో యాచకునకు భిక్ష పెట్టారు. అంతేకాక అతనిని లోనికాహ్వానించి అప్పటివరకు తాను గడిపిన జీవిత విశేషాల్ని వివరించమన్నారు.

బాబా చూపిన అవ్యాజానురాగంతో దౌలత్‌సింగ్ వుత్తే జితుడైనాడు. నోరు బొంగురు పోయింది. మాట తడబడింది. దుఃఖం పెల్లుబికింది. కళ్ళ నీళ్ళు ధారా ప్రవాహంగా కారజొచ్చాడు. అతి సంతోషంగా మూగవేదన ఆనుభవించాడు.

కాసేపటికి తమాయించుకున్నాడు. బాబాను క్షమాపణ కోరాడు తన మూగవేదనకు. ఆ పిమ్మట తన కథనంతా వివరించాడు. ఆనాడు బెల్గాంలో దుఃఖాక్రాంతుడై యున్నందువ, తన యింటికి పంపివేయ బడినప్పుడు తిన్నగా యింటికి వెళ్ళగా కుటుంబ సభ్యులు అతని రాకకు అమిత సంతోషం చెందారు. అయితే బాబా విధించిన నియమాలు అతడు పాటించవలసి వచ్చేసరికి వారందుకు కలత చెందారు.

ముఖ్యంగా గౌరవనీయమగు ఒక వున్నత కుటుంబం నుండి వచ్చిన దౌలత్‌సింగ్ భిక్షాటన చేయుట వారికి గిట్టలేదు. భరించలేకపోయారు. ఆ పనినుండి ఆపుటకు వారెంతో ప్రయత్నించారు. చుట్టాలు, పక్కాలు ఎంతగానో చెప్పిచూశారు. బ్రతిమాలారు. బామాలారు. అదిరించారు. చివరకు బెదిరించారు. అయినా అతడు భిక్షాటన మానలేదు. తుదివరకు బాబా ఆజ్ఞలు పాటించాలని ధృఢంగా నిశ్చయించుకున్నాడు.

కులపెద్దలచేతచెప్పించారు. అయినావినలేదు. యింటినుండి బయటకు పోనీయకుండా కట్టుదిట్టం చేసినా ఫలితం కుదరలేదు. చివరకు కుటుంబ సభ్యులు దౌలత్‌సింగ్‌ను ఇంటినుండి తరిమే శారు. బాబా ఆజ్ఞలు పాటిస్తూ వూరు, యిల్లు వదలి సంచార జీవితం ప్రారంభించాడు. భౌతికంగా బాబా సమక్షంలో లేకున్నా తక్కిన అనుచరుల మాదిరి ఇతడు కూడ కాలి నడక, భిక్షక వృత్తి, ఆరుబయట జీవనం మున్నగు వివిధ భాగాలన్నీ అనుభ వించాడు. బెంగుళూరు బయలుదేరి పూనా మీదుగా సతారా చేరాడు. అనూహ్య ఘటనగా ఈ రోజు బాబాను సందర్శించే అదృష్టం లభ్యపడినట్లు వివరించాడు.

మిత్రులంతా అతని మూగవేదన శ్రద్ధతో విన్నారు. బాబా ముఖవర్చస్సు దేదీప్యమానంగా వెలుగొందింది. అతని ప్రేమకు ముగ్ధులై బాబా అతనిని భిక్షాటన జీవితంనుండి విముక్తి కలిగిం చారు. ఇంటికి తిరిగి వెళ్ళి తన వైద్యవృత్తి మళ్ళీ చేపట్టమని ఆదేశించారు. "నీకు నాయందున్న ప్రేమకు నేను చాల సంతో షించాను. ఇప్పుడు నీవు వూహించని రీతిలో నా గుమ్మంలో నికి వచ్చినట్లే నీవుకూడ ఎప్పుడో ఒకప్పుడు నీ గుమ్మంలో నన్ను హఠాత్తుగా చూడగలవు. ఇది నేను నీకిచ్చే వాగ్దానం. నీవు వెంటనే సతారా వదలి బెంగుళూరు వెళ్ళిపో" అన్నారు. వెళుతూ బాబా ఆలింగనం పొంది మరీ వెళ్ళాడు.

ఇక్కడ అప్రస్తుతమే అయినా బాబా ఆనాడిచ్చిన వాగ్దానం ప్రకారం కొన్నాళ్ళు గడిచాక దౌలత్‌సింగ్ యింటికి వెళ్ళి దర్శన

మిచ్చారు. హఠాత్తుగా జరిగిన ఈసమాగమంలో కనీసం టీ అన్నా ఇవ్వలేక అచేతనుడైనాడు. ఈదర్శనప్రాప్తి కాగానే దౌలత్‌సింగ్ శరీరత్యాగం జరిగింది. బాబాలో శాశ్వతంగా లీనమైనాడు.

## విశ్వజనీనదృష్టి

అది జూలై 25, 1950. నవజీవనంలో అత్యంత ప్రధానమైన రోజు. అనుచరులంతా చీకటితో నాలుగు గంటలకే లేచారు. కాలకృత్యాలు తీర్చుకున్నారు. స్నానాదికాలు ముగించుకొని తాము సమావేశం కానున్న హాలు శుభ్రంగా కడిగి అరబెట్టారు. సూర్యోదయం కాగానే హాలులో అంతా సిద్ధమైనారు. బాబా వచ్చీ రాగానే తలుపులు, కిటికీలన్నీ మూసివేయమన్నారు.

డాన్‌కిన్ చేత ఒక ముఖ్య ప్రకటన చదివించారు. "నవజీవనంలో ఈరోజు సుదినం. పూర్వజీవనంలోని స్త్రీ, పురుషులందరికీ, శిష్యులు, ప్రేమికులు, భక్తులందరికీ నా నమస్సుమాంజలులు. నూతన జీవన సహచరులకు ప్రణామములు. నేనీనాడు దయగల భగవంతుని మా తప్పులన్నిటినీ, బలహీనతలను, అపజయాలను క్షమించమని వేడుతున్నాను. పూర్వ జీవన అనుయాయులందరికీ దైవమందు వున్న ప్రగాఢ విశ్వాసం సడలకుండునట్లు సహాయపడ వలసినదిగా కోరుతున్నాను. నూటికి నూరుపాళ్ళు తమ బాధ్యతలు నిర్వర్తించుట కవుసరమగు శక్తిని ఏర్పాటువాలాలకు ప్రసాదించమని వేడుచున్నాను. నవజీవన అనుచరులకు సత్యానికి కట్టుబడి వుండి నవజీవన నియమాలను నిజాయితీతో పాలించుటకు తగు శక్తి నివ్వమని కోరుతున్నాను."

పై ప్రకటన పూర్తి కాగానే అనుచరులందరికీ బాబా ప్రణామాలాచరించి పురుషులందరినీ బయటకు వెళ్ళమన్నారు. బాబా ఒక్కరే లోపవుండి పై ప్రకటనను పునశ్చరణ చేసి మళ్ళీ మిత్రులందరినీ లోపలకు రమ్మన్నారు. ప్రతివారి పాదాలకు శీర్షాభివందనం చేశారు. హిందూ, క్రిస్టియన్, జోరాష్ట్రియన్ మహమ్మదీయ ప్రార్థనలు మిత్రుల చేత పఠింపజేశారు. ఆఖర్లో భగవద్గీతలోని శ్లోకాలు అంగ్లంలో షుమారు గంటసేపు పఠింప చేశారు. ఆఖర్లో నవజీవన గీతం పాడారు.

ఇదంతా పూర్తిఅయిం తర్వాత బాబా ఒక మస్తుకు సేవలో నిమగ్నమైనారు. పిమ్మట అనుచరులందరికీ స్వయంగా భోజనం వడ్డించారు. పేదవారికి చొక్కా, లాగూతో పాటు దుప్పటి జత, పరుపు కూడ పంచిపెట్టారు. ఆ రోజంతా బాబా క్షణం తీరిక లేకుండా వున్నారు. ఆ రోజున కేవలం ద్రవాహారం మాత్రమే తీసుకొని వుపవాసమున్నారు.

మర్నాడు మిత్రుల్ని పిలిచి తాము వుంటున్న బంగళా అజమాయిషీ చూసే అధికారి యింటికి భిక్షకు వెళదామని వారింటికి వెళ్ళి వారు పెట్టిన భిక్షను స్వీకరించి క్రితం రోజు ఆచరించిన వుపవాస దీక్ష విరమించారు.

## వైతాళికుడు

బాబా నిజానికి వైతాళికుడు. బాబాకు దూరంగా వున్న వాళ్ళకు వారి అనుచర బృందం ఆచూకీ తెలియుటలేదు. ప్రియ

తముని గురించి తెలుసుకోవాలని తహతహ పడుతున్నారు. అంతలో బాబా పూర్వ జీవనంలో వారందరికీ ఓ సర్క్యులరు పంపమని ఆదీని ఆదేశించారు. రానున్న అక్టోబరు 16వ వారం దరిని తాను కలుసుకోనున్నట్లు కూడ అందులో తెలుపబడింది.

తమ మకాం మళ్ళీ సతారా నుండి ఎత్తివేయ సంకల్పించారు. తదుపరి మజిలీ మహాబలేశ్వర్‌గా నిశ్చయించారు. ఈ సరికొత్త సర్క్యులరులో అంతవరకు తనతో జీవితాంతం అంటి పెట్టుకొని వున్న సేవక మిత్రుల్ని 16-10-'50న తాము అలాగే కొనసాగటమా లేక పాత జీవితపు శిష్యులుగా మారటమా తేల్చుకునేందుకు మరో అవకాశం కల్పించారు. చాల జాగ్రత్తగా ఆలోచించి ఒక వేళ బాబా తోటే గడపాలని నిర్ణయించుకొంటే వారిలో కొద్ది మందిని 1950 నవంబరు 1వ తేదీ నుండి 1951 జనవరి అంతం వరకూ మూడు నెలలపాటు తనతోపాటు మస్తులు, పేదల కార్యక్రమాల్లో పాల్గొనేందుకు తీసుకు వెళతానని ఆ సమయంలో భిక్ష, లంగోటీ, జిప్సీ జీవితపు భాగాలు కూడ గడపాలని తెలిపారు.

16 అక్టోబరు 1950న మరల పాత జీవితంలో అడుగిడి నాలుగైదు గంటలు గడిపి మళ్ళీ వెంటనే నవజీవనంలోకి ప్రవేశించుటకు నిశ్చయించారు. నవజీవనంలోని మిత్రులందరికీ, నవజీవనంలో బాబాతో వుండేందుకు మరోఅవకాశం కల్పించారు.

పాతజీవితపు పురుష శిష్యులందర్నీ ఆహ్వానించారు. ఏర్పాటుదారుల్ని కూడ మహాబలేశ్వర్‌కు 16వ తేదీన రమ్మన

మని ఉదయం 7-11 గంటల మధ్య జరిగే కార్యక్రమంలో పాల్గొనమని అందరికీ తెలియపరిచారు. ఈ ఆహ్వానాన్ని అంగీకరించిన వారు తమ భోజన వసతుల గురించి ఎట్టి పరిస్థితుల లోనూ బాబాతో కానీ, తక్కిన మిత్రులతో కానీ ముచ్చటించ రాదని ఆదేశించారు.

ముందు ముందు చేయ తలపెట్టిన మస్తు కార్యక్రమం పేదలకార్యక్రమాలకి చేతిలోవున్న పైకం అంతంత మాత్రంగా వున్నందున చాలదేమోనని బాబా దృష్టికి తేబడింది. జరగబోయే కార్యక్రమ ప్రాముఖ్యాన్ని బట్టి ఆనాటి సమావేశానికి వచ్చే వారి నుండి తగు మొత్తంలో పైకాన్ని స్వీకరించుటకు బాబా అంగీకరించారు. సమావేశానంతరం పైకాన్ని ఎంత మాత్రం అంగీకరించనన్నారు. పాత జీవితంలో ప్రవేశించిన ఆ నాలుగు గంటలలో వసూలయ్యే మొత్తం మస్తు అక్కౌంటులో జమచేయ బడుతుందని ప్రకటించారు. అలా పైకాన్ని బాబాకు సమర్పించుకో దలచినవారు 50 రూ॥లకు తగ్గకుండా 500 రూ॥లకు మించకుండా చెల్లించాలన్నారు.

భారతావనిలోని వివిధ ప్రదేశాల్లో వున్న బాబా భక్తులందరికీ ఆదిజీ సర్క్యులరును పంపారు. బాబాను మళ్ళీ చూడ కలుగుతున్నామన్న వార్త చదువుకొని ప్రతివారు తమ అదృష్టానికిఆశ్చర్యపడుతూ ప్రియతమునితో సమాగమమయ్యే రోజు కోసం ఎదురు చూడసాగారు. ఢిల్లీ, డెహెరాడూన్, హమీర్ పూర్, నాగపూర్, బొంబాయి, పూనా మున్నగు వివిధ ప్రాంతాల

నుండి బాబా గ్రూపులవారు తామంతా సమావేశానికి వస్తున్నట్లు ఆదీకి జాబులు వ్రాశారు.

నూతన జీవతంలో బాబాతోనే వుండదలచుకున్న సేవక సహచరులు బాబాను అన్ని విధాలా, నిజాయితీతో, భక్తి శ్రద్ధలతో సేవిస్తూ ఆయనకు నూరుపాళ్లు విధేయులై వుండాలని, నిబంధనలకు వ్యతిరేకంగా బాబా ఏమైనా చెప్పినట్లు తోచినా, వారాయన చెప్పినట్లు చేసి తీరాలని శిష్యులతో మరోసారి బాబా హెచ్చరించారు. ఆదీ పంపిన సర్క్యులరు చూచుకున్న పాత జీవితపు ప్రేమికులెందరో ఆనందపరవశులయ్యారు.

1950 అక్టోబరు ఆరంభంలోనే బాబా సతారా వదలి, మహాబలేశ్వర్‌లోని ఆగాఖాన్ బంగళాలో ప్రవేశించారు. విశాలమైన యీ బంగళాలోనే చరిత్రాత్మకమైన సమావేశం ఏర్పాటు చేశారు.

## పాత జీవిత ప్రవేశం

బాబా నవజీవనం శాశ్వతమైనది. ఇందులో ఆయన సేవకులు కాక, యితరులెవరైనా ఆ జీవితం జీవించాలని కోరుకుంటే, వారు స్వతంత్రంగా అలా జీవించ వచ్చును అని బాబా చెపుతూ చక్కటి ప్రవచనం చేశారు.

కొన్ని వందల మంది బాబా ప్రేమికులు పురుషులు మాత్రమే, దేశం నలుమూలలనుండి 1950 అక్టోబరు 15 నాటికే

మహాబలేశ్వర్ చేరుకున్నారు. వారంతా మర్నాడు ఉదయం 6-45 నిలకే ఫ్లారెన్స్ హాల్లో సమావేశం కావల్సి వుంది. యీ భవనం పూర్వం ఆగాఖాన్‌కు చెందింది. ప్రస్తుతం పూనా ఎడ్యుకేషన్ అసోసియేషన్ వారి స్వంతం. పట్టణంలో వున్న హోటళ్లన్నీ బాబా ప్రేమికులతో కిట కిట లాడాయి.

ఉదయం ఆరయ్యే సరికి ప్రేమికులంతా ముస్తాబై, బారులు తీరి నగర ప్రధాన మార్గమంతా కనులవిందు కల్పించారు. బాబా విడిది చేసిన భవనంలో వారంతా చేరే సరికి, అప్పటికే ముందున్న ఖాళీ స్థళంలో బాబా నిలబడి వచ్చే వారందరికి స్వాగతం చెప్పారు. బాబా అప్పుడు నవజీవనంలో వున్నా, పూర్వ జీవపు దివ్య తేజస్సు కొట్టి వచ్చినట్లు కనపడింది. ఆహ్వానితులంతా బాబా పిలుపుకై వువ్విళ్లూరు తున్నారు.

అంతలో ఆదీ వచ్చి, ఆయా ప్రేమికులను బాబాకు పరిచయం చేస్తున్నాడు ఒక్కొక్కరినే. సర్వజ్ఞుడైన బాబా వారిని ఎరుగనట్లే, చిరు నవ్వుతో స్వాగతం చెబుతూ ప్రతి వారికీ ఆలింగన భాగ్యం కలిగించారు. నులివెచ్చటి ఆయన స్పర్శతో ప్రతి వారి హృదయం చిరు దీపమై వెలుగొందింది. స్వాగత సత్కారాలు పూర్తి కాగానే బాబా వారందరిని లోపల హాల్లో ఆశీనులు కమ్మని ఆదేశించారు. అది అంతకు ముందు ఆగాఖాన్ చేత పందెపు గుర్రాల కొట్టంగా వుపయోగించ బడేది.

ఆ హాల్లో ఓ మూల మామూలు సాదా కుర్చీలో బాబా కూర్చున్నారు. నవజీవన సహచరులంతా ఆయన దగ్గర్లో

కూర్చున్నారు. కుడివైపున డా॥ ఘనీ కూర్చున్నాడు. ప్రేక్ష కులుగా వచ్చిన ప్రేమికులంతా నిశ్శబ్దంగా తమ తమ స్థానాల్లో కూర్చున్నారు. బాబా ప్రేమికులందర్నీ వారిష్టం వచ్చిన రీతిలో సుఖాశీనులై కూర్చోమన్నారు. సమావేశం ప్రారంభ మగుటకు ముందు ఆ కొట్టానికి బయటనున్న పెద్ద గేటును వెంటనే మూసి రమ్మని మండలిలో ఒకరైన విష్ణుకి పురమాయించారు.

పాపం విష్ణు గేటు దగ్గరికి వెళ్ళేసరికి అల్లంత దూరంలో వృద్ధ సహచరుడు గుస్తాద్‌జీ మెల్లగా అడుగులేస్తూ వచ్చుట గమ నించాడు. బహుశః ఆయన కాలకృత్యం తీర్చుటకు వెళ్ళి నట్లున్నాడు. వృద్ధుడైనందున ఆయన వయస్సును గౌరవించి ఆయన వచ్చేవరకు గేటు మూయకండా నిలబడ్డాడు విష్ణు. అంత లోనే ఇద్దరు, ముగ్గురు ఆగంతకులు లోపలకు చొచ్చుకు వచ్చారు. ఆ తర్వాత గుస్తాద్‌జీ రాగానే గేటు మూసి విష్ణు, గుస్తాద్‌జీలు సమావేశంలో పాల్గొన్నారు.

విష్ణు వెళ్ళి గేటు వేసి వచ్చేలోపు బాబా కుర్చీలో కూర్చొని కొద్ది గంటలపాటు తాను పాత జీవితంలో అడుగుపెట్టా నని అన్నారు. సహచర మిత్రులంతా పాత జీవితంలోకి వచ్చా రని ప్రకటించారు. 1, 1బి, 1సి, 2 పథకాలు రద్దయినట్లు ప్రక టించారు. అంతా తమ దృష్టిని బాబా పైనే కేంద్రీకరించారు. ఆయన ఆరోగ్యం అంత బాగా లేకపోయినా ఆయన ముఖార విందం జేగీయమానంగా వెలుగొందుతోంది. కళ్ళు తళుక్కున మెరుస్తున్నాయి. ఆ సుందర ముఖారవిందాన్ని చూడకుండా

ప్రేక్షకుల కళ్ళు తప్పించుకోలేకపోయాయి. అందరి దృష్టి ఆయనపై కేంద్రీకరించబడింది.

వ్యక్తిగతంగా ఆయన ఒక్కొక్కరిని కలిసి కుశలాలడిగినప్పుడు అంతర్గత ప్రేరణ ఏమి కలిగించారోగాని దివ్య ప్రియతముని తదేకంగా చూస్తూ బాబా ప్రేమికులంతా ప్రపంచాన్నే మరచి ఏకసంధాగ్రాహులై కన్నులనుండి ఆనందాశ్రువులు ఏకధారగా స్రవిస్తుంటే మౌనంతో ఆయన్నే చూస్తూ వుండిపోయారు. ప్రేమమూర్తియైన ఆయన శక్తి వారి హృదయాల్ని స్పందింప చేసింది.

అంతలో విష్ణూ గేటు వేయకుండా గుస్తాద్‌జీ కొరకు ఎదురు చూస్తున్నప్పుడు లోనికి తీసుకు వచ్చిన యిరువురు అనాహ్వానితులు సరాసరి బాబా సన్నిధికి తీసుకు వెళ్ళి వినయంతో ఆయనెవరో తెలియకపోయినా భక్తితో గౌరవ ప్రపత్తులు ప్రదర్శించారు. వంగి బాబా పాదాలను స్పృశిస్తూ నమస్కరించారు. వెంటనే బాబా లేచి వారిరువురి పాదాలపైన విడి విడిగా తన శిరము వుంచి ప్రతి నమస్కారం చేశారు. దాంతో వారిరువురు మిగుల ఆశ్చర్యపోయి మళ్ళీ ఆయన ముందు సాగిలపడి సాష్టాంగ దండ ప్రమాణాలాచరించారు. వారి ప్రతి చర్య బాబాకు బాధ కలిగించింది. నవజీవన నియమాన్ననుసరించి ఎవరైనా తనకు గౌరవ ప్రపత్తులు ప్రదర్శిస్తే వాళ్ళెలా చేస్తే అలా తిరిగి వారికి గౌరవ ప్రపత్తులందించుట రివాజు. బాబా అలాగే చేశారు. కానీ వారిరువురు మళ్ళీ ప్రతి నమస్కారం

చేసేసరికి విస్తుపోయిన కొందరు వారితో బాబా వారికి నమస్కరించినందున అది వారికెంతో వుపకరిస్తుందని బాబా ఏం చేసిన వూరుకుంటే మంచిదని , ఆయన ఏం చేయమంటే అది చేయమని వారికి నచ్చచెప్పారు. చివరకు వారిని బయటకు వెళ్ళిపొమ్మంటే అందుకు వారు సమ్మతించి వెంటనే వెళ్ళిపోయారు.

ఆ తర్వాత విష్ణుని దగ్గరకు పిలిచి ఆలశ్యంగా ఎందుకు వచ్చావని ప్రశ్నించారు. అందుకు విష్ణు "బాబా! వృద్ధుడు గుస్తాద్ వస్తూ దూరంగా కనిపించాడు, అందుకని అతడు వచ్చేంత వరకు ఆగుటవలన ఆలశ్యమైంది" అన్నాడు. నిజానికి అలా ఆగుట వలన అతడు బాబా ఆజ్ఞ జవదాటినట్లైంది. అలా గేటు వెంటనే మూయనందున ఇరువురు ఆగంతకులు ఆహ్వానం లేకుండానే లోనికి జొరబడే వీలు చిక్కింది. వారి రాకతో బాబా వుద్విగ్నులైనారు. అసలు బాబా ఎప్పుడు ఎలాంటి సమావేశా లేర్పాటు చేసినా ఆహ్వానించినవారు మాత్రమే హాజరవ్వాలని షరతు విధిస్తారు. అందుచేత యీనాటి సమావేశానికి కూడ యీ విషయంలో సడలింపు లేదు.

తన ఆజ్ఞను వుల్లంఘించినందున విష్ణుని అందరి ముందు తీవ్రంగా బాబా మందలించారు. "నీవు నా ఆజ్ఞ విన్న వెంటనే పాటించి గేటు మూసేయాలిగాని సాక్షాత్తు భ గ వం తు డే గేటులోకి వస్తున్నప్పటికి కూడ ఆయన వచ్చేంతవరకు ఆగరాదని" మందలిస్తూ వెంటనే గేటు వేయని నేరానికి విష్ణుని దగ్గరకు పిలిచి చాచి లెంపకాయ కొట్టారు. బాబా జలాలిలాగా మారిపో

యారు. మొఖమంతా కంద గడ్డలా తయారైంది. చెంపదెబ్బ తిన్నా విష్ణు చలించలేదు. బాబాకు సంపూర్ణసమర్పణ ఐపోయాడు.

అనుకోని ఈ సంఘటన సమావేశ స్థలి అంతటా వాతావరణాన్ని మార్చివేసింది. విష్ణూ అత్యంత విధేయతతో తన తప్పును అంగీకరించాడు. పాత జీవిత ప్రేమికులంతా విష్ణూ యొక్క నడవడిక, అప్పటి అనుభవం గడపటమంటే ఏమిటో ప్రత్యక్షంగా తెలుసుకున్నారు. సహచర మిత్రులందరి నుండి ఆయన కోరేది, పరిపూర్ణ విధేయత, సంపూర్ణ సమర్పణ.

బాబా విష్ణూని మందలించటంతో యీ కథ పూర్తికాలేదు. తన ప్రేమికుల్లో ఒకరిని పిలిచి 'తానలా వుద్రేకం చెందుట సరియైనదేనా?' అని ప్రశ్నించారు. అతని నుండి ఎటువంటి జవాబు ఆశించకండానే వేరే ఒక భక్తుడ్ని పిలిచి తన చెంపపై చాచి కొట్టమని ఆదేశించారు. పాపమాభక్తుడు ఆజ్ఞ పాటించితీరాలి కనుక చాచి కొట్టలేక ఆయన బుగ్గపై చిన్నంగా చెయ్యానించాడు. అతడు మృదువుగా స్పృశించినందుకు తృప్తి చెందక "నీ విరోధిని దండించేప్పుడు అలాగే చెంపదెబ్బ కొడతావా? చాచి కొట్టాలి" అంటూ కరాచీ నుండి వచ్చిన మరో ప్రేమికుని పిలిచి మళ్ళీ చెంపదెబ్బ కొట్టమన్నారు.

అతడు వెంటనే లేచి ధభీమని చాచి కొట్టాడు. బాబా బుగ్గ బుస బుస పొంగి ఎర్రపడిపోయింది. అందుకు బాబా ఎంతో సంతోషించారు. ఆ తృప్తి, ఆయన ముఖ వర్చసుని దేదీప్యమానంగా వెలుగొందేట్లు చేసింది. ఇంకా అప్పటికి సభ ప్రారం

భం కాలేదు. దూరంగా వెనుక వరుసలో కూర్చున్నవారి కసలు ఏం జరుగుతుందో అర్థం కాలేదు. అంతా అగమ్యగోచరంగా చూస్తున్నారు. దగ్గర్లో వుండి కళ్ళారా అంతా గమనించినవారికి మనస్సులో పరిపరి విధాల ఆలోచనలు చోటుచేసుకున్నాయి. ఈ యావత్తు సంఘటనా బాబా నవజీవన స్థాయి నుండి పూర్వ జీవన స్థాయికి దిగివచ్చుటను సూచిస్తోంది.

## బా బా ఉ ప దే శ ం

ఈ ప్రత్యేక సమావేశం ఏర్పాటుచేయుటకే బాబా పూర్వ జీవనానికి దిగి వచ్చానని ప్రకటించారు. తన సహచర మిత్రులు కూడ తనతోపాటు పాత జీవితంలో ప్రవేశించారన్నారు. మీటింగు ప్రారంభం కాబోయే ముందు అప్పటి వరకూ గడిపిన నవజీవనంలో తాను కోరుకున్న రీతిలో జీవించ లేకపోయినందుకు భగవంతుని క్షమించమని బాబా కోరుకున్నారు. నవజీవన మిత్రులు నవజీవన నియమాల్ని సరిగా పాటించలేక పోయినందుకు వారి బలహీనతలకు ఆయన క్షమించానంటూ తమ మనస్సు నేదైనా తాను నొప్పించి వుంచే తనను క్షమించమని అందర్నీ అభ్యర్థించారు. దాంతో క్షమాపణ క్షమించువారు, క్షమించబడువారు అంతా ఒకటైనారు. దివ్యమయ ఏకత్వమంటే ఇదే.

ఇటువంటి సన్నివేశాల్లో వినయం, దివ్యత్వం రెండు ప్రస్ఫుటంగా కానవస్తాయి. ముందు వరుసల్లో కూర్చున్నవారు ఆయన దివ్యమంగళ రూపం నుండి ప్రేమ ప్రకాశం ప్రజ్వరిల్లు

తున్నట్లు అనుభూతి చెందారు. తర్వాత డాన్‌కిన్‌ని లేపి తన వుపదేశాన్ని బిగ్గరగా చదవమని ఆదేశించారు. ఆ వుపదేశంలోని పదాలు అందర్నీ బాగా ఆకట్టు కున్నాయి. ప్రేక్షకుల హృదయాల్ని దోచుకున్నాయి. డా॥ డాన్‌కిన్ బాబా వుపదేశాన్ని ఇంగ్లీషులో చదవగా డా॥ దేశ్‌ముఖ్ హిందీ అనువాదాన్ని చదివాడు. వచ్చిన వారందరికీ బాబా స్వయంగా ఉపదేశపు (Seremon) ప్రతులను పంచిపెట్టారు. 16-10-50వ తేదీన సమావేశమైన ప్రేమికులందరికీ బాబా యిచ్చిన (సెర్మన్) ఉపదేశాల్ని ప్రతిరోజూ పఠించమన్నారు. ఆ వుపదేశం ఈ విధంగా వుంది.

"పాత జీవితమందు ప్రస్తుతమున్న యీ కొద్ది గంటల పాటు నేను మీకు సుస్థిరమైన దివ్య సత్యాల్ని చెప్తాను.

"అవశ్యంగా మనమంతా ఒక్కటే. అందుకని భిన్నంగా వున్నామనుకొనుట కేవలం అజ్ఞానం. తనను తాను తెలుసుకొనే చైతన్యం కావాలని జీవుడు కోరుకుంటాడు. సృష్టిమీద ఆధారపడకుండా యీ లక్ష్యాన్ని స్వతంత్రంగా సాధించలేడు కనుక మానవుడు తప్పనిసరిగా వూహాజనితమైన అహాన్ని పోగుచేసుకొని ఎనలేని అనుభవాలు పొందుటద్వారా జ్ఞానాన్ని సంపాదించాలి. ఈ విధంగా జీవాత్మకు, జ్ఞానానికి బదులు మొదట అజ్ఞానం ఎదురౌతుంది.

ద్వైత రూపాలు, మాయా సృష్టి అంతా అజ్ఞానం నుండి జనించినవే. జనన-మరణాలు, సుఖ-దుఃఖాలు, పుణ్య-పాపాలు,

మంచీ-చెడ్డా అన్నీ యీ అజ్ఞానం నుండి ఆవిర్భవించినవే. నీవెప్పుడూ పుట్టలేదు. ఎన్నడూ మరణించలేదు. ఎప్పుడూ బాధపడలేదు. ఇహముందు బాధపడబోవు. నీవు ఎల్లప్పుడూ వున్నావు. ఎల్లప్పుడూ వుందువు. నీవు వేరన్న వునికి కేవలం వూహాజనితం.

రాజుగా, బిచ్చగానిగా, ధనికుడుగా, పేదవానిగా, పొడుగు పొట్టి, బలవంతుడు-బలహీనుడు, రూపవంతుడు-కురూపి, హంత కుడు-హతుడు ఇలా ఆత్మ అనేక రూపాల్లో అనుభవాలు సంపాది స్తుంది. నిజంగా తాను ఒక్కటే మరియు అవిభాజ్యమూ అయి నప్పటికీ జీవాత్మ తాను వేరని భావించినంత కాలం యీ అనుభ వాలన్నీ పొంది తీరాల్సిందే. జీవాత్మ మాయామయమైన యీ అనుభవాల సంస్కారాలన్నిటినీ ఎప్పుడైతే విడిగి వేసుకుంటుందో అప్పుడు దాని అసలు నగ్నరూపం పొంది ఏకము, అవిభాజ్యము, సత్యము, అనంతము అయిన పరమాత్మతో సమైక్యాన్ని గుర్తి స్తుంది.

ఈ సంస్కార బంధాల నుండి అనేక మార్గాల ద్వారా విముక్తి పొందుతుంది. దైవ సాక్షాత్కారం పొందే ఈ మార్గా లన్నిటిలో అతి ముఖ్యమైనది ప్రేమ. ఈ ప్రేమద్వారా ఆత్మ పరమాత్మలో పూర్తిగా లీనమైపోతుంది. చివరకి తనను తాను విస్మరిస్తుంది. పిడుగు పడ్డప్పుడు దానికి తగిలిన ప్రతిదీ భస్మీ పటలమైనట్లు ఆ సమయంలో హఠాత్తుగా జ్ఞానోదయమై అజ్ఞానం పటాపంచలవుతుంది.

భ్రాంతుల్ని, సంశయాల్ని, చింతల్ని యీ జ్ఞానం నిర్మూలిస్తుంది. అన్ని బాధలు పోయి జీవిత పరమావధియైన శాశ్వత శాంతి, నిత్యానందం ప్రతిష్టించ బడతాయి. ఇప్పుడాత్మ తన సమస్తమైన మాయల నుండి విముక్తి పొంది స్వస్వరూపమైన పరమాత్మలో ఏకత్వాన్ని గుర్తిస్తుంది.

ఆశలకు, కోరికలకీ జ్ఞానం అతీతమైన దైనందున దానిని మనమాశించవద్దు. ఈ జ్ఞానం మన వూహాలకందనిది, అవగాహన కానిది యైనందున దానిని గురించి తర్కించవద్దు. అది నిశ్చయములకెల్ల నిశ్చయమైనది కావున దానిగురించి సంశయించవద్దు. కామపూరితము, ఆశాపూరితము, అసత్యము, అపవిత్రమునైన మనస్సు యీ జ్ఞానమునందుకోలేనందున మనం యింద్రియలోలత్వం గల జీవితాన్ని గడపవద్దు. ఆత్మల కెల్ల ఆత్మయైన దైవాన్ని మనం ప్రేమించెదము గాక. అట్టి ప్రేమ యొక్క పరాకాష్టయందే జ్ఞానమున్నది.

దైవంతో పరిపూర్ణులైన సత్పురుషులు వారిచ్చగించినవారి కెవరికైనా, ఎప్పుడైనా యీ జ్ఞానాన్ని ప్రసాదించగలరు. మన మందరం అచిరకాలంలోనే ఈ జ్ఞానాన్ని పొందెదము గాక."
"మనమందరమూ అచిరకాలంలోనే యీ జ్ఞానాన్ని పొందెదము గాక" అన్న వాక్యం ఒక రకమైన హామీని, అభయ హస్తాన్ని అందించినట్లు కనపడుతుంది. తన కృపాకటాక్షాన్ని పొంద కలిగిన అదృష్టవంతులకు దివ్య జ్ఞానాన్ని బహుమతిగా అందిస్తున్నారన్నమాట.

పై వుపదేశాన్ని చదివించింతర్వాత పాత జీవితపు శిష్యులు, భక్తులు, ప్రేమికులందరికీ నమస్కరించారు. యితరులకు దివ్య సత్యాల్ని పభోదించే సందర్భంలో ఎలా నడుచుకోవాలో తెలుసు కొనుట కిదొక గుణపాఠం. తర్వాత అక్టోబరు 21 నుండి ప్రారంభం కానున్న మస్తు పేదల కార్యక్రమాల కవుసరమైన భూరి విరాళాన్ని బాబా స్వయంగా అందుకున్నారు. అది తన ప్రేమికులకిచ్చిన అపూర్వ అవకాశం. అందులో ఎవ్వరూ విధిగా యిచ్చి తీరాలన్న ఆంక్ష లేదు. ప్రక్కవాడెంత యిచ్చాడోకూడ ఎవరికీ తెలియదు.

## పుకార్ రాక

ఇలా ఎవరి యిష్టప్రకారం వారు తమ తమ అవకాశాన్ని పయోగించుకొని బాబాకు విరాళాలర్పిస్తున్న సమయంలో ఒక బలాఢ్యుడు ప్రేక్షకులలోనుండి లేచి ధరించిన గుడ్డలన్నీ వూడదీసి కేవలం లంగోటీ మాత్రం వుంచుకొని మౌనంతో నిలబడ్డాడు. ఆయన పేరు పరమేశ్వరి దియాళ్ నిగమ్ హమీర్‌పూర్ నివాశి పుకార్. అతడలా ప్రవర్తించుటకు ముందేమి జరిగిందో కొద్దిగా తెలుసుకుందాం. చిన్నతనం నుండీ అతను రామ భక్తుడు. అత్యంత భక్తితో ప్రేమించే గ్రంథం రామాయణం. దైవ మానవుడైన రాముడ్ని కీర్తిస్తూ అతడు ఎంతో భక్తితో రామాయణ పారాయణ చేసేవాడు. చదువు సంధ్యలైం తర్వాత మెల్లగా రాజకీయాల్లో దూకాడు.

అప్పట్లో భారతదేశం దాశ్య శృంఖలాల్లో వుండుట చేత మాతృ దేశాన్ని చెరనుండి విముక్తి చేయాలని ప్రతిన పూనాడు. ఆధ్యాత్మిక జీవితం గడపాలన్న చిన్నప్పటి వుత్సాహం క్రమంగా తగ్గిపోయి తిరుగుబాటుగాతయారై రహస్యసంఘంలో ఒక ముఖ్య నాయకుడుగా మారాడు. మెహెర్‌బాబాను గురించి విన్న మొదట్లో ఆయనొక బ్రిటిషు గూఢచారి అనుకున్నాడు. భారతీయుల్ని స్వాతంత్ర్య పోరాటంనుండి మరలిస్తున్నారను కున్నాడు. ఆయనొక అసత్య గురువుల ముఠాకు చెందినవాడని ప్రజలను తప్పుదారి పట్టిస్తున్నారని అనుమానించాడు.

తాను యుగావతారునిగా బాబా ప్రకటించడంతో అతడి మనస్సు బాగా తిరుగుబాటు చేసింది. అంచేత మెహెర్‌బాబా మోసగాడని బహిర్గత పరచేందుకు నిశ్చయించుకున్నాడు. ఆయన దైవత్వానికి వ్యతిరేకంగా తన వుద్దేశాల్ని బహిరంగంగా వ్యక్త పరిచాడు. అతడెంత ప్రయత్నిస్తున్నా హమీర్‌పూర్‌లో వుండే తన బంధువులు, మిత్రులెందరో బాబాను మానవ రూపంలోవున్న దైవంగా ఆరాధించ మొదలుపెట్టారు. దాంతో అప్పట్లో హరిద్వార్, డెహెరాడూన్‌లో వున్న బాబాను చూడాలన్న అభిలాష కలిగింది. కానీ ప్రతిసారి అతడు బాబాను చూడలేకపోయాడు. హరిద్వార్ వెళ్ళగా బాబా డెహెరాడూన్ వెళ్ళారు. తీరా డెహెరాడూన్ వెళితే సతారా వెళ్ళిపోయారు. అది 1940కి ముందు జరిగింది.

బాబా అధికారాన్ని ప్రశ్నిస్తూ 1940 ఆరంభంలో అతడెన్నో వుత్తరాలు వ్రాశాడు. తన అనుచరుల నుండి పరిపూర్ణ

విధేయత ఆశిస్తూ తాను మాత్రం తన ఇష్టంవచ్చినట్లు ముందుగా నిర్ణయించిన తేదీలను సైతం మార్చి కార్యక్రమాలకు కట్టుబడి వుండకపోవటాన్ని తీవ్రంగా విమర్శించాడు. మరో వుత్తరంలో తానవతారుడుగా వుండికూడ బెంగాలు కరువులో వందలాది మంది తిండికి కరువై ఎందుకు చావాల్సి వస్తోందని అసహనంతో ప్రశ్నించాడు. తాను స్వయంగా భారతదేశంలోనే వుండగా యింతటి విపత్తులు జరిగిపోతుంటే మానవాళిని బాధల్నుండి తానెలా విముక్తి చేయగలరని తన ఆశ్చర్యాన్ని ప్రకటించాడు.

ఆ రోజుల్లో బాబా మస్తు కార్యక్రమంలో నిమగ్నమై వుండుటచేత కేవలం అతి ముఖ్యమైన వుత్తరాల్ని మాత్రమే బాబా చూచేవారు. పుకార్ వుత్తరాని కెటువంటి జవాబు రాలేదు. సద్గురువుల కార్య విధానం సరిగా అవగాహన కానందువ తన వుత్తరాలకు జవాబిచ్చే ధైర్యం బాబాకు లేకపోయిందని అనుకున్నాడు. దాంతో బాబా మీద విశ్వాసం పోయింది. పైపెచ్చు తన చుట్టూ లెక్కువమంది బాబాను ప్రేమిస్తున్నారు. ఫలితంగా ఆయన మీద అప నమ్మకం బాగా పెరిగింది.

ఇలాంటి గందరగోళ సమయంలో బాబా మహాబలేశ్వర్‌లో ఏర్పాటుచేసిన సభ గురించి విన్నాడు. అదృష్టవశాత్తు తనను కూడ రమ్మనమన్న ఆహ్వానం అందింది. ఇన్నేళ్ళుగా తనలో అణుచుకున్న సమశ్యను తేల్చుకొనుటకీ అవకాశాన్ని సద్వినియోగ పరచుకోవాలనుకున్నాడు. ఈ సమావేశంలో పాల్గొనేందుకు బయలుదేరి నప్పటి నుండీ బాబా తనను ఆయన

వైపు లాగుతున్నట్లు అనిపించింది. అతడ్ని అయోమయ పర చిన సంఘటనలు కూడ జరిగాయి. హమీర్‌పూర్ నుండి బయలు దేరి మహాబలేశ్వర్ చేరేంత వరకూ జరిగిన ప్రయాణం ఎన్నో విశేషాలతో జరిగింది. మహాబలేశ్వర్ చేరేముందు పూనాలో జరుగుతున్న బాబా ప్రేమిక భజన కార్యక్రమంలో పాల్గొన్నాడు. ఆ భజనయ్యేంత వరకూ తన్మయత్వంలో ఆనంద భాష్పాలు దొర్లాయి.

తర్వాత జరిగిన గోష్ఠిలో బాబా లీలలు కొన్ని విని ముగ్ధుడైనాడు. చివరికివన్నీ అతనిలో కొంత పరివర్తన తెచ్చి నిజంగా బాబా తానసుకొనే ఏకైకుడైన దైవమే అయితే ఆజన్మాంతం ఆయనతోనే వుండిపోయి మళ్ళీ యింటికి తిరిగి పోనని శపథం చేశాడు.

మహాబలేశ్వర్ చేరగానే అక్టోబరు 16 వుదయం బాబా ఒక్కొక్కరినే ఆలింగనం చేసుకొనుట గమనించి చలించి పోయాడు. తన వంతు రాగానే ఆయనముందు కుప్పకూలిపోయి విలపింపసాగాడు. అతని కళ్ళ వెంట కారే కన్నీటితో అంతకు ముందతనికి బాబాపై కలిగిన అనుమానాలన్నీ తుడుచుకు పోయాయి. గుర్రపు శాలమైన ఫ్లొరెన్సు హాల్లో బాబాకు ఎదురుగా కూర్చున్న అతని హృదయంలో మాటలకందని పెల్లుబుకు జరిగింది.

బాబా ప్రత్యేక కార్యక్రమ సహాయార్థం భక్తులు తమ ప్రేమకొద్దీ విరాళాలర్పిస్తున్నారు. అది వారిష్టానుసారం యిచ్చేది

కనుక పుకారంతకుముందు విరాళమివ్వాలనుకోలేదు. అయితే యిప్పుడున్న స్థితిలో తన వద్దనున్న సర్వం సమర్పించు కోవాల నిపించింది. లంగోటీ తప్ప తాను ధరించిన దుస్తులన్నీ వూడ దీశాడు. వాటన్నిటినీ మూట కట్టాడు. దానికి ముందు తన వద్దవున్న డబ్బుతోపాటు ఓ చీటీ వ్రాసి జేబులో వుంచి మూట కట్టాడు. పేదల సహాయార్థం తన వద్ద వున్న సమస్తం, తనువు మనస్సుతో సహా సద్గురువైన మెహెర్‌బాబా పాదాల చెంత వుంచుతున్నాను అని ఆ కాగితంపై వ్రాశాడు. దాని ప్రకారం ఆ మూటలో భాగంగా తానామూటపై నిలబడ్డాడు. ఆ పిమ్మట ఆపలేని దుఃఖంతో బాబా ముందు సాగిలపడ్డాడు. దాదాపు నగ్నంగా అంత మందిలో నిలబడేసరికి అతడు తెలివి తప్పాడని కొందరు, మస్తయ్యాడేమోనని మరికొందరు అనుకున్నారు.

అదంతా బాబా లీల. ఆ బట్టల మూట తన దగ్గరకు తెమ్మనమని పుకార్‌నాదేశించారు. అతడు బాబా చెంతకెళ్ళుట కెవరో సహాయపడ్డారు. బాబా ఎంతో ఆప్యాయతతో గుడ్డల వంక చూచి మూటను ముద్దిడి మళ్ళీ అతనికిచ్చివేశారు. మళ్ళీ బట్టలు ధరించమని ఆదేశించారు. "ఈ సభ సమాప్తం కాగానే తిన్నగా హమీర్‌పూర్ వెళ్ళిపో. నీవు చేస్తున్నపని కొనసాగించు. అయితే ఒకటిమాత్రం గుర్తుంచుకో! ఇంతకు ముందు నీవాపనిని నీ కోసరం చేశావు. ఇప్పుడు బాబా కోసరం చేయాలి. అంత ర్గతంగా వెలువడేదానికి విలువుందికానీ బాహ్యంగా ప్రకటించేది విలువ లేనిది." అని చెప్పారు.

పూనాలో వుండగా అతడు నిర్ణయించుకున్న శపథానికిదో జవాబు. ఈనాడు ప్రపంచంలోవున్న అనేక రాజకీయ పార్టీలు వేదాంత సంఘాలు నిర్వహించే కార్యక్రమాలు ప్రచారాలకి యిప్పుడు బాబా అతనిలో ఆంతరంగికంగా కలిగించిన మేల్కొలుపుకి ఎంతో భేదం వుంది. ఆ సత్యాన్ని పుకార్ తర్వాత సంవత్సరాల్లో బాబా సాహచర్యంతో గ్రహించ కలిగాడు.

ఆ అవగాహనతో రాజకీయాలతోను, సంఘపరంగా వున్న కార్యక్రమాలతో తనకున్న సంబంధాలను తెంచుకొని తన సేవలను బాబాకు అంకితం చేసుకున్నాడు. బాబా యొక్క దైవత్వ క్షణికాన్ని మాత్రం ఆనాటి అక్టోబరు సమావేశంలో అనుభవించాడు. ఆయన అవతార తత్వంపై పూర్తి నమ్మకం కొన్నాళ్ళ తర్వాతకాని కుదరలేదు. ఈ మీటింగు జరిగే రోజులలో అతడు పుకార్ అనే హిందీ వారపత్రికకు సంపాదకుడుగా వుండేవాడు. అది ఓ రాజకీయ వారపత్రిక.

బాబాపై పరిపూర్ణ విశ్వాసం కుదిరిం తర్వాత దాన్ని మాసపత్రికగా మార్చి "మెహెర్‌పుకార్" అనే పేరుతో మెహెర్ బాబా ప్రేమ, సత్యసందేశాల్ని చాటుతూ దానిని ఆయన సేవకు అంకితం చేశాడు. పరమేరీదయాళ్ బాబాకి సన్నిహితుడై ఆయనకు ఆంతరంగికుడు కాగా అంత పెద్దపేరుతో పిలిచేబదులు పుకార్ అని మారుపేరు పెట్టారు. అప్పటినుండి అతడు అందరితో పుకార్ అనే పిలవబడేవాడు. ఇదీ పుకార్ కథ.

స్వచ్ఛందంగా ప్రేమికులందించిన కానుకలన్నీ బాబా స్వీకరించారు. ఆదీ తెచ్చిన పైకం కూడ తీసుకున్నారు. ఆ మొత్తమంతా 21 నుండి ప్రారంభం కానున్న మస్తు కార్య క్రమంలో ఖర్చు చేస్తారని చెప్పారు. తరువాత బయటకు పోదలచిన వారికి 15 నిమిషాలు విరామం యివ్వబడింది.

## పంకరాజు వివాహం

అంతకు ముందు రాత్రి బాబా ప్రేమికులంతా నగరంలోని వివిధ హోటళ్ళలో బసచేశారు. వారిలో ఎవరికైనా తానంతకు ముందిచ్చిన ఆజ్ఞలు పాటించుటలో ఏవైనా చిక్కులుంటే వాటిని తన దృష్టికి తెమ్మనమని అవకాశమిచ్చారు. అలాంటివారు తమ సమశ్యనొక కాగితంపై వ్రాసి మర్నాడు అందించమన్నారు. మర్నాడంటే 16వ తేదీ వుదయం జరిగిన సమావేశం కొంచం విరామం జరిగిం తర్వాత మళ్ళీ ఆరంభమైంది. అంతా లోపలికి వచ్చారేమోనని బాబా అడిగి తెలుసుకున్నారు. పిమ్మట యీ సమస్యలమీద చర్చించేందుకు అనుమతించారు. చాలామంది చాలా నోట్సు వ్రాసి యిచ్చారు. అన్నీ విన్న బాబా అందరికీ అనేక రాయితీలు తమ పూర్వపు ఆదేశాలకు బదులుగా ఇచ్చారు.

అంతలో పంకరాజు అనేవారి చీటీ వచ్చింది. అతను అంతకు ముందు తన వివాహం బాబా సమక్షంలో జరిగే అవకాశ మిమ్మని అర్థించాడు. అసలు దీనిని గురించి ముందు కొంత తెలుసుకుందాం. ఇతని పూర్తి పేరు రామాపంకరాజ్. 1940

నాగపూర్‌లో కాలేజీలో చదువుతున్నాడు. వేసవి శలవుల్లో ఆధ్యాత్మిక గ్రంథాలు కొన్ని చదవటం తటస్థించింది. దాంతో అతని హృదయంలో ఆధ్యాత్మిక విషయాలు చోటు చేసుకున్నాయి. రానురాను అది ఒక పిచ్చగా మారి చదువుకు స్వస్తి చెప్పి తండ్రి మాటకూడ లెక్క చేయకుండా సత్యాన్వేషణ కుపక్రమించాడు. సంపన్న కుటుంబం వారిది. కనీసం కాలేజీ చదువన్నా పూర్తి చేయించాలన్న తండ్రి కోరిక నెరవేరలేదు.

ఆధ్యాత్మిక క్రమశిక్షణలన్నీ ఖచ్చితంగా పాటిస్తూ సరిక్రొత్త జీవితం ఆరంభించాడు. ఉప్పు, కారం లేని చప్పిడి తింటూ కటిక నేలమీద పడుకుంటూ తన బలహీనతలు రోజూ చేస్తున్న దీక్ష గురించి దినచర్య వ్రాసేవాడు. మిత్రులు కొందరిని కలుపుకొని కొన్ని నియమాలు ఏర్పరచుకున్నారు. తానొక సాధకుడుగా సాధన ప్రారంభించాడు. అంతకు ముందు కాలేజీలో గడిపిన జీవితానికి పూర్తి భిన్నమైన జీవితం మొదలైంది.

కాలేజీలో చదివే రోజుల్లో అతను గొప్ప క్రీడాకారుడు. అన్ని కార్యక్రమాల్లో పాల్గొనేవాడు. అప్పట్లో అతనికి ఆధ్యాత్మిక విషయాల్లో ఆసక్తి లేదు. పైగా సాధువుల జీవితాల గురించి తీవ్రంగా విమర్శించేవాడు. మరి అంతకు యింకా ముందు చిన్నతనంలో రోజూ గంటల తరబడి రామనామాన్ని స్మరించేవాడు. బహుశః ఆధ్యాత్మిక విత్తనం ఆ విధంగా చిన్నప్పుడే అతనిలో నాటబడిందేమో !

ఒకరోజున డా॥ సి. డి. దేశ్‌ముఖ్‌గారి "అవతారుని అవ శ్యకత" అన్న వుపన్యాసం వినుట తటస్థించింది. మెహెర్ బాబా ప్రేమ సందేశం అతని హృదయంలో నాటుకుపోయింది. బాబాను గురించి అతను మరింత చదివి, విని ఆయన ప్రేమ మూర్తని, అందానికి ప్రతి రూపమని అనుకున్నాడు. బాబాను గురించి అతను ఎంత గురి పెంచుకున్నాడో అంతగా తనకున్న సాధు బృందాల బంధాల్ని తెగతెంపులు చేసుకున్నాడు.

కొడుకు దైన్య స్థితికి తండ్రి కుపితుడై అతడ్నొక దారికి తేవాలని తన కార్యాలయంలోనే ఖాళీ వస్తే తాత్కాలికంగా గుమాస్తాగా వేయించాడు. తనకు వచ్చిన మొదటి జీతంతో మెహెరాబాద్ వెళ్ళి బాబాను చూచిరావాలని నిశ్చయించాడు. బాబా ఎక్కడున్నారో తెలియదు కనుక వెళ్ళొద్దని దేశ్‌ముఖ్ వారించాడు. ముందుగా జాబు వ్రాసి అనుమతి పొందింతర్వాత వెళ్ళమని సలహా చెప్పాడు. అయినా బాబాను చూడాలన్న ఆదుర్దాలో ఎంత మాత్రం ఆగదలుచుకోలేదు. నాగపూర్‌లో రైలెక్కి అహ్మద్ నగర్‌లో దిగాడు. అతడెప్పుడూ అక్కడికి వెళ్ళి వుండలేదు. కానీ ఒక పుస్తకంలో మెహెర్‌రిట్రీట్ బొమ్మ అది రైల్వేలైను ప్రక్కనున్నట్లు చదివి వున్నాడు.

ఆ కాస్త గుర్తుతో అతడు రైలు పట్టాలు పట్టుకొని రిట్రీటు కొండ వచ్చేంతవరకు నడక సాగించాడు. తీరా కొండ పైకి వెళ్ళేసరికి ఎదో కట్టడపుపని పర్యవేక్షిస్తూ పెండూ కనిపిం చాడు. ఆయనద్వారా బాబా మెహెర్‌బాద్‌లో లేరని తెలుసుకొని

చాలా విచారించాడు. మెహెరాబాద్ మేనేజరైన పెండూ అతడ్ని క్రింది మెహెరాబాద్ ఆశ్రమంలో వుండుటకనుమతించాడు. చాలా నెలలు గడిచిం తర్వాత మొదటిసారిగా ఇక్కడే అతడు టీ త్రాగి పరుపుపై పడుకున్నాడు. అక్కడ మండలివారు గడుపుతున్న జీవిత విధానాన్ని గడుపుతున్న ఖంకరాజ్ క్రమంగా బాబా తన భక్తులు ఆయన్ను హృదయపూర్వకంగా గుర్తుంచుకొని ఎలాంటి ఆంక్షలు లేని సామాన్య జీవితం గడపాలని ప్రేమ, నిస్వార్థసేవలతో కూడిన జీవితం గడపాలని గుర్తించాడు. మామూలు భోజనం దొరికితే వుసూరుమనటం, విందు భోజనం దొరికినప్పుడు అర్రులు చాచటం పనికిరాదు. ఆధ్యాత్మికతను ప్రదర్శిస్తే ఆధ్యాత్మిక జీవితలక్ష్యమే దెబ్బతింటుంది.

అనుకోకుండా బాబా ఆ మరునాటి ఉదయం మెహెరాబాద్ చేరారు. మండలివారిని హడావిడిగా రమ్మనమని కబుర్లుపెట్టారు. దాదాపు సంవత్సరం తర్వాత వారంతా ఆయన్ను కలుసుకోబోతున్నారు. యీ సంవత్సరమంతా ఏకాంతవాసం గడుపుతూ మస్తు కార్యక్రమంలో నిమగ్నమై వున్నందున వారెవరికీ ఆయన దర్శనభాగ్యం దొరకలేదు.

బాబా నుంచి ప్రత్యేక ఆజ్ఞలుపొందే హడావిడిలో వారంతా వుండే సందట్లో సదామియా అని పంకరాజు విష్ణూద్వారా ఎలాగో తనరాక గురించినవార్త బాబాకు చేరేట్లుచేశాడు. బాబా దర్శనం అర్థిస్తున్నట్లు కబురంపాడు. అయితే అది ఒక ప్రత్యేక ఆధ్యాత్మిక కార్యక్రమానికి సంబంధించిన ఏకాంతవాస ఘట్ట సమయమైనందున అతనికి దర్శన మిచ్చుటకు బాబా తిరస్కరించారు.

కానీ పంకరాజు మెహెరాబాదు వచ్చింది బాబా దర్శనం చేసుకొని శాశ్వతంగా అక్కడే వుండిపోదామని. మరి ఎవరి క్షణిక దర్శనం పొంది ఆయన పాదాల చెంత సర్వార్పణతో తన జీవితాన్నే సమర్పించుకోవాలనుకున్నాడో ఆయన అందుకంగీకరించలేదు. దాంతో అతడు చలించిపోయాడు. పైగా అతని కోరికకు జవాబుగా బాబా తన గురువులలో ఒకరైన నారాయణ మహరాజును కేడ్గాం వెళ్ళి దర్శించమని చెప్పారు. నిజానికిదొక అసాధారణమైన ఆజ్ఞ. అయితే అందులో ఏదో తెలియని విశేషం గుప్తంగావుంది.

పంకరాజు బాబానైతే ప్రేమిస్తున్నాడు కానీ ఆయన గురువులమీద సదభిప్రాయం లేదు. కొన్ని మరాఠీ పత్రికలలో ముఖ్యంగా ఉపాశినీ మహరాజు, నారాయణ మహరాజుల మీద వ్యతిరేక ప్రచారం జరుగుటతో వారిపై అతనికసలే గురిలేదు. కేడ్గాం వెళ్ళాలన్న తలంపు లేదు. వెళ్ళేందుకు పైకమూ లేదు. కానీ బాబా పంపిన సందేశాన్నతడు అంగీకరించకున్నా ఆయన సద్గురువులపై తనకున్న దురభిప్రాయం పటాపంచలయ్యేట్లు చేసింది. బాబాను బాబాగా అంగీకరించాలంటే అంతరంగ సహాయమొక్కటే కాదు ఆయన కృప కూడ కావాలి.

దర్శనం చేసుకోవాలన్న కోరిక తిరస్కరింపబడటంతో పంకరాజు విచలితుడైనాడు. బాబా ఆజ్ఞలకు విధేయుడై ఆశ్రమాన్ని వెంటనే విడిచిపెట్టాడు. రోడ్డుమీదకు చేరి ఒకవేపచెట్టు క్రింద బైటాయించాడు. మెహెరాబాద్ కొండపైనున్న బాబా

దర్శనార్ధం వెళ్ళే ప్రతి మండలి సభ్యుడ్ని తన గోడు బాబాకు చెప్పి పునఃపరిశీలన జరిగేట్లు చూడమని ప్రాధేయ పడటం మొదలుపెట్టాడు. పెల్లుబికి వస్తున్న దుఃఖాన్ని దిగమింగలేక పోతున్నాడు. అలా చాలా సేపు దుఃఖాన్ని అనుభవించాక విష్ణూ ఓ చల్లని వార్త తెచ్చాడు. "బాబా నిన్ను రమ్మంటున్నారు వెళదాం రా!" అంటూ కొండపైకి తీసుకువెళ్ళాడు. అప్పుడు బాబా ఒక చెట్టుక్రిందవున్న గచ్చు అరుగుమీద నిలబడి వున్నారు. 50 అడుగుల దూరంలో వుండగా పంకరాజును ఆగిపొమ్మన్నాడు విష్ణూ.

బాబా సిల్కు కోటు వేసుకొని దేదీప్యమానంగా వెలుగొందుతున్నారు. సాధారణంగా ప్రత్యేక కార్యక్రమం చేసేప్పుడు బాబా తన సన్నిహిత మండలిని తప్ప యితరులెవరినీ తనను దర్శించుట కనుమతించరు. అయితే అది పంకరాజు అదృష్టం. అతడు సాక్షాత్తు దైవత్వాన్ని, ఆ మాధుర్యాన్ని ప్రియతమునిలో చూచాడు. అప్పుడతని ఆనందాని కవధులులేవు. బాబాని తదేకంగా చూస్తున్నాడు. నోటితో ఏమీ అర్ధించలేదు కానీ అతని హృదయం మాత్రం బాబాతో సమైక్యమైంది. అంతా బాబా "ఇక చాలుగదా? మరి వెళ్ళిరా!" అని సౌంజ్ఞ చేశారు.

మళ్ళీ విష్ణూయే పంకారాజును కొండ క్రిందికి తీసుకువెళ్ళి దించాడు. దారిలో విష్ణూ గురించి అతని కుటుంబాన్ని గురించి వారెలా బాబా పరిధిలోకి వాచ్చారో అంతా అడిగి తెలుసుకున్నాడు. బాబా ఆదేశాల మేరకు విష్ణూ మాటల మధ్యలో "ఒకవేళ బాబా

నీ జీవితావసరాలకు సరిపడినంత ధనం సమకూరిస్తే సంతో షిస్తావా?” అని అడిగాడు. నేనందుకు రాలేదిక్కడికని జవాబి చ్చాడు. ఈ సంగతిని విష్ణూ పంకరాజుని క్రింద మెహెరాబాదులో వదలి పైకి వెళ్ళి బాబాతో చెప్పగా ఆయన చాలసంతోషించి పంకరాజుని మళ్ళీ వచ్చి మరోసారి దర్శనం చేసుకోమని కబు రంపారు.

ఆనందంతో పంకరాజు పరుగెత్తాడు. కళ్ళారా బాబా దివ్య మంగళ రూపాన్ని దర్శించుకున్నాడు. మళ్ళీ ఒక సంవత్సరం గడిచాక బాబా తనని పిలుస్తారని అప్పుడు తనకు కొన్ని ఆజ్ఞలు జారీచేయబడతాయని వాటిని హృదయపూర్వకంగా ఆచరించాలని అతనితో చెప్పారు. ఇహ తిన్నగా తన యింటికి నాగపూర్ వెళ్ళిపొమ్మన్నారు. మెహెరాబాదు వదలివెళ్ళే లోపు మరో వార్త పంపుతూ బాబా నజరు అతనిపై వుంటుందని తెలిపారు.

మొదట్లో బాబాను చూచేందు కనుమతించక తిరస్కరించి అతఃపాతాళానికి కుంగిపోయాడు. కాగా దరిమిలా బాబా దర్శనాని కనుమతించటం ప్రేమ సందేశాలివ్వటం ద్వారా ఆకాశానికెగిరాడు. బాబా తరచు చేసే ఈలాంటి ఛద్మవేశాలు తమ సన్నిహితులుగా మార్చేందుకు వారి హృదయాలు తన ప్రేమతో నింపేందుకు సహాయపడతాయి.

ఎంతో తేలిక హృదయంతో పంకరాజు అహ్మదు నగరం వదిలాడు. సకోరాలో ఉపాశినీ మహారాజుని దర్శిద్దామని దార్లో చిటాలీ స్టేషన్‌లో దిగుదామనుకున్నాడు. కానీ తిన్నగా ఇంటికి

పొమ్మన్న బాబా ఆజ్ఞ గుర్తొచ్చి ఆ ప్రయత్నం విరమించు కున్నాడు. భూసావల్ స్టేషన్ చేరే సరికి నాగపూర్ వెళ్ళే రైలు ప్రక్క ప్లాట్‌ఫారం మీద సిద్ధంగా వుంది. అక్కడ రైలు మారాలి. ఎక్కవలసిన రైలు సిద్ధంగా వున్నా అతడి మనస్సు మరి కాస్సేపాగి వూళ్ళోకి వెళ్ళి వూరంతా తిరిగివచ్చి మరో రైలులో వెళ్దామని ప్రేరేపించింది.

గురువు చెప్పినట్లాచరించి విధేయుడు కావాల్సినవాడి మనస్సును చెడగొట్టే సైతాను చేష్టలంటే ఇదేకదా! పనికిరాని ఆలోచన! పాపం శంకరాజు తన దుష్ట తలంపుకు లొంగిపోయి ప్రయాణం వాయిదా వేసుకొని వూరు చూట్టానికి వెళ్ళాడు. తీరా స్టేషనుకు చేరి పొరపాటున వేరే రైలెక్కాడు. అతి కష్టం మీదఎన్నో వ్యయప్రయాసలుపడి చివరికెలాగో నాగపూర్ చేరాడు. అయితే గురువాజ్ఞ పాటించకండా తన చిత్తం ప్రకారం నడుచు కున్నందుకు అతడనుభవించిన ఆ అనుభవం మాత్రం జన్మలో మరువలేకపోయాడు. అది అతనికో గుణపాఠం నేర్పింది. బాబా ఆజ్ఞలెన్నడూ స్వార్ధ దృష్టితో మార్చకూడదని తెలుసుకున్నాడు. మెహెరాబాదులో బాబా దర్శనానంతరం అతనిలో ఎంతో మార్పు వచ్చింది.

ఆధ్యాత్మిక సాధనలో కఠోర నియమాలకు బదులు సరి క్రొత్త జీవనం చోటుచేసుకుంది. తనజీవితంలో జరిగే ప్రతి మంచీ చెడుల వెనుక బాబాహస్తం ప్రచ్ఛన్నంగావుందన్న సత్యంగ్రహిం చాడు. అసలుతనను మెహెరాబాదు వెళ్ళి ప్రియతముని దర్శించు

కొన్నేట్లుచేసి తనజీవితంలో ఒకక్రొత్త అధ్యాయం ప్రారంభించేట్లు చేసింది. తన పూర్వజన్మ సుకృతమని అంతా ఆయన యిచ్ఛ ప్రకారమే జరిగినట్లు విశ్వశించాడు.

1942 వేసవిలో పంకరాజు ప్రత్యేకంగా డెహెరాడూన్ పిలవబడ్డాడు. కొన్ని ప్రత్యేకాజ్ఞలిచ్చి వాటిని తు. చ. తప్ప కాచరించమని ఆదేశించారు. దానితో తనను బాబా చేరదీశారని గాఢంగా విశ్వశించాడు. అలా చాలా ఏళ్ళు గడిచింది. బాబాకు అత్యంత సన్నిహితుడైనాడు. తాను బ్రహ్మచారిగా వుండిపోవా లనుకున్నాడు. కానీ పరిస్థితులందుకు భిన్నంగా మారాయి. అసలు తాను "పెళ్ళి చేసుకోవచ్చా లేదా" అని బాబాను ఒకరోజు అడిగాడు. ఒక బాబా ప్రేమికురాలెవరైనా పెళ్ళి చేసుకొను టకు బాబా అంగీకరించారు.

అయితే వారి వివాహం తన సమక్షంలోనే జరగాలని చెప్పారు. ఇంకా ఆ వివాహ ఘడియ రాలేదు. కాలచక్రం దొర్లిపోయింది. బాబా కొద్దిమంది మిత్రులతో నవజీవనంలో ప్రవేశించారు. ఈ ఘట్టంలో ఆయనను చూడటంగానీ, ఆయనతో ఉత్తర ప్రత్యుత్తరాలు జరుపుటగానీ నిషేధించారు. అందుచేత పంకరాజు వివాహం ఆగిపోయింది. ఆ తలంపు విరమించు కున్నాడు. అనుకోకండా మహాబలేశ్వర్‌లో జరుగుతున్న ఈనాటి సమావేశంలో తమ ప్రేమికుల కష్టాలేవైనా వుంటే తమముందు వుంచుకోమని చక్కని అవకాశం కల్పించారు. ఆ కష్టాలు తావం తకుముందిచ్చిన ఆజ్ఞలను పాటించుటలో ఇబ్బంది కల్గించేవైతే, తన దృష్టికి తెమ్మన్నారు.

అలా వారి వారి కష్టాల గురించి విశదపరచే సమయలో షంకరాజు విషయం ప్రస్తావనకు వచ్చింది. మరి కేవలం పురుషులు మాత్రమే ఈ సమావేశానికి ఆహ్వానించబడినందున పాపం పంకరాజు ప్రేమించిన పెళ్ళికూతురు ఆమె బాబా ప్రేమికురాలైనప్పటికీ ఆనాటి సమావేశానికి రాలేదు. తన మునుపటి ఆజ్ఞ పాలించబడుటకు బాబా కురువృద్ధుని వంటి గుస్తాద్‌జీని చేరపిలిచి పంకరాజు ప్రక్కన పెళ్ళికూతురుగా నటించమన్నారు. అంతా గొల్లున నవ్వసాగారు. ఆ నవ్వుల మధ్య పంకరాజుని, గుస్తాద్‌జీని దగ్గరకు పిలిచి వారిరువుర్ని భార్యా భర్తలుగా కరచాలనం చేసుకోమన్నారు.

వారిరువురలా చేయగానే బాబా ఆ దంపతులిరువురూ చిరాయువులుగా వర్ధిల్లాలని ఆశీర్వదించారు. ఆ తర్వాత పంకరాజును తమ గ్రామం చేరి వారి ఆచారప్రకారంకాసీ లేక తన యిష్టం వచ్చినట్లుగా తాను కోరుకున్న వధువుతో వివాహం చేసుకోమని చెప్పారు. బాబా ఆజ్ఞమేరకు నాగపూరు చేరిన పంకరాజు మతాచారాలు, సాంప్రదాయాలు ప్రక్కన పెట్టి నిరాడంబరంగా తన వివాహం పూర్తికావాలని నిశ్చయంచుకున్నాడు. వధువు తారారాణితో తిన్నగా రిజిష్ట్రార్ కార్యాలయానికి వెళ్ళి అక్కడ రిజిష్టరులో తామిరువురు సంతకాలుచేసి బాబా ప్రేమకు చిహ్నంగా వారిరువురు భార్యా భర్తలయ్యారు. ఈ నాటికీ బాబా ప్రేమలో రామాపంకరాజు, తారారాణీలు సఖ్యతగా సుఖ జీవనం గడుపుతున్నారు.

ఈ విధంగా బాబా తనముందుకు తెచ్చిన ప్రతివారి సమస్యల్ని అత్యంత ప్రేమతో పరిష్కరించారు. ఇలా ఎందరో భక్తులు, ప్రేమికులు బాబా ముందుంచిన సమస్యల పరిష్కారం పూర్తికాగానే బాబా ప్రసన్న వదనంతో సంతుష్టులై తదుపరి విషయాన్ని తీసుకున్నారు.

## పూర్ణ దైవత్వం - పరిపూర్ణ వినయం

హాల్లో బాబా కూర్చున్న కుర్చీ వెనుకభాగాన ఒక పెద్ద అట్ట వ్రేలాడదీశారు. ఆ అట్ట మధ్యలో బాబా ఫొటో ఒకటి అతికించబడింది. దానిమీద పెద్ద అక్షరాలతో పూర్వ జననం-పూర్ణదైవత్వం-దైవమానవుడు అని కుడివైపున వ్రాయబడి వుంది. ఎడమవైపున నవజీవనం-పరిపూర్ణ వినయం, సామాన్య మానవుడు అని వ్రాయబడి వుంది. ఈ మాటల కర్థాలు వివరించేందుకు అంతకు ముందే ఒక వివరణను తయారుచేసిన సభలో వివరించేందుకు సిద్ధంగా వుంచారు. దైవ మానవుని జీవితం ద్వారా యీ రెండు స్థితులు చేతలలో ఏలా బహిర్గతమవుతాయో యీ వివరణలో తెలియచేయబడింది. డాన్కిన్‌ని పిలిచి ఈ ప్రత్యేక సందేశాన్ని చదవమన్నారు.

నేనే గనుక ఆ ఏకైకుడినే అయితే నా పూర్వజీవన శిష్యులంతా నన్నలాగే కొలుచుకొనుడు. ఎటువంటి సంకోచం లేకుండా, ఎలాంటి బంధాలు లేకుండా అటువంటి విధేయత

ప్రేమలతో హృదయపూర్వకంగా కట్టుబడివుండి నా పూర్వజీవన ఆజ్ఞలన్నీ పాటించండి. యథార్థ ప్రేమకు అర్హమైన జీవనం గడపండి. నేనెవరైయున్నా ఆ దయగల తండ్రి తప్పక వారికి ఆధ్యాత్మిక లాభాన్ని కలుగచేస్తాడు. వారెట్టి ప్రతిఫలమాశించక పోయినా ఆయన తప్పక యిస్తాడు.

నా పాతజీవితం నన్ను సంపూర్ణమైన దైవత్వం, పరిపూర్ణమైన దైవికము యొక్క పీఠంమీద వుంచింది. నా నవజీవనం దేవునికి, ఆయన ప్రజలకి, వినయంగల సేవకునిగా వుండేట్లు చేసింది. నా నవజీవనంలో నేను అన్వేషకుడ్ని, ప్రేమికుడ్ని మరియు మిత్రుడ్ని. యీ పరిపూర్ణ దైవత్వం, పరిపూర్ణ వినయమనే రెండు స్థితులు భగవంతుని యిచ్ఛ ప్రకారం కలిగాయి. ఇవి రెండు కూడా శాశ్వతంగా భగవంతుని నిత్యమైన జీవితంతో ముడిపడి వున్నాయి. ఎవరిష్టం వచ్చినట్లు వారు నన్ను గురించి నమ్మకం పెట్టుకోవచ్చును. కానీ ఎవరూకూడ ఆశీర్వచనాల్ని, మహత్తుల్ని లేదా ఎట్టి బహుమానాల్ని నా నుండి కోరవద్దు. నా నవజీవనం శాశ్వతమైనది.

అవునన్న వాళ్ళున్నారు. వారంతా నవజీవనంలో నాతో గడుపుటకే నిశ్చయించారు. అప్పటివరకూ గడిపిన వారి జీవితంలో తమ బలహీనతల్ని నిష్పక్షపాతంగా పరిశీలించి బేరీజు వేసుకొని రానున్న జీవితంలో నన్ను అనుసరించుటకు పునరాలోచన చేసి ఒక నిర్ణయానికి రండి. ఒకవేళ వారు నా నవజీవన

కాలంలో సేవకులుగా నాతో చేరాలనుకుంటే నూటికి నూరుశాతం నాకు విధేయులు కావాలి. వారినేమి చేయమని నేను కోరితే తు. చ. తప్పకాచరించాలి. నా ఆజ్ఞలయందు సేవకుల విధేయత అవిచ్ఛన్నంగా ఎటువంటి వత్తిడులు బలవంతం లేకుండా వుండాలి. నేనెలాంటి ఆజ్ఞలు జారీచేసినా అవి వారి స్వేచ్ఛకు భంగం కలిగిస్తున్నాయన్న భావం ఏమాత్రం రాకుండా చిరు నవ్వుతో ఆనందంగా పాలించాలి. 1949 ఆగష్టు 31న మెహె రాబాదులో జరిగిన ప్రధమ సమావేశంలో అంగీకరించిన నియ మాలలో ఎట్టి మార్పు లేదు."

ఈ సందేశపు హిందీ అనువాదాన్ని డా॥ దేశ్‌ముఖ్ చది వాక ఇంగ్లీషు నకళ్ళు అందరికీ పంచిపెట్టారు. తరువాత ఒక అరగంట విరామం ప్రకటించారు. అందరికీ లడ్డూలు ప్రసాదంగా పంచిపెట్టారు. తలా ఒక కప్పు టీ కూడా ఇచ్చారు. విరామ కాలం పూర్తికాగానే మళ్ళీ అంతా హాల్లో సమావేశమయ్యారు. వాళ్ళకు వప్పగించిన పనులు ఎంతో కష్టతరమైన వైనప్పటికీ ఏర్పాటువాలాలెంతో భక్తి శ్రద్ధలతో నెరవేర్చినందుకు బాబా తమ సంతోషాన్ని వ్యక్తపరిచారు.

మూడవసారి ఆనాటి సమావేశం ఆరంభం కాబోయే ముందు ప్రక్కనున్న గదిలోకి వెళ్ళి బాబా నవజీవనం ప్రమాణం చేశారు. కొద్దిసేపైన తరువాత తెల్లని కఫ్నీ ధరించి, చంకకో కాషాయరంగు జోలి తగిలించుకొని తిరిగివచ్చి తమ కుర్చీలో కూర్చున్నారు. నవజీవనంలో భిక్ష చేసేప్పుడీ జోలెను ఆయన

వాడారు. కుర్చీలో కూర్చొని తానిప్పుడు మరల నవజీవనంలో ప్రవేశించినట్లు ప్రకటించారు. అవునన్న వాళ్ళందర్నీ తమ నిర్ణయాన్ని తెలుపమని అడిగారు. నవజీవనంలో బాబాకు విధే యులై నిబంధనలను నూటికి నూరుపాళ్ళు పాటించటమో పూర్వ జీవనంలో వుండిపోవటమో లేదా స్వతంత్ర జీవనం గడుపుటో ఏదో ఒకటి తేల్చుకోమన్నారు.

ఆదీ, దౌలత్‌సింగ్, అన్నాజక్కార్, అలోబా, నూకరాస్, పండోబా, కిషన్‌సింగ్, బాలనాట్, డా॥ ఘనీలు పాత జీవితం గడుపుటకు నిశ్చయించుకున్నారు. పెండూ, విష్ణూ, ఈరుచ్, నీలూ, డా॥ డాన్‌కిన్, కాకాబారియా, బైదుల్, గుస్తాద్‌జీ, మురళి, కైకోబాద్ దస్తూర్‌లు సేవకులుగా నవజీవనంలో బాబాతో వుండిపోవుటకు నిశ్చయించుకున్నారు.

నవజీవనం ఆయన కోరుకున్న రీతిలో పరిపూర్ణంగా జీవించుటకు తగు శక్తినిమ్మని బాబా దేవుని ప్రార్థించాడు. 1950 జూలై 25న సతారాలో చేసినట్లు హిందూ, ముస్లిం, క్రిష్టియన్, జోరాష్ట్రియన్ ప్రార్థనలు విష్ణూ, నీలూ, కైకోబాద్, బైదులు, డా॥ డాన్‌కిన్‌ల చేత చదువబడినాయి. సభలో నెలకొన్న ఉద్వేగం ప్రార్థనలు చేయగానే మారిపోయింది. ఆ తర్వాత ఒక ఖవ్వాలి కచ్చేరి జరిగింది.

లోగా సతారాలో పాడిన ఖవ్వాల్ ప్రత్యేకంగా పిలిపించ బడ్డాడు. హార్మోనియం, డోలక్, బుల్‌బుల్, తరంగ్ సహా యంతో నవజీవన గీతాన్ని మధురంగా ఆలాపన చేశాడు. పాట

పూర్తయ్యే సమయంలో బాబా మెల్లగా తన కుర్చీలోంచి లేచి బయటకు వెళ్ళి బాప్జీ అనే అలీషామస్తును స్నానం చేయించారు. ఒక్కో చెంబు నీళ్ళు పోస్తూవుంటే బాప్జీ చాలా ఆనందించాడు. ఆయన తృప్తికోసంచేసే ఈ అంతరంగిక కార్యక్రమంతో బాబా కూడ ఎంతో సంతోషంగా కనపడ్డారు. అందరి సమక్షంలో ఒక మస్తుకు స్నానం చేయించుట చాలా అరుదుగా జరిగే సంఘటన.

దానితో కార్యక్రమం ముగిసింది. అందర్నీ వెళ్ళమన్నారు. వెళ్ళిపోయేవారిలో కొందరి కళ్ళవెంట నీళ్ళు ధారగా ప్రవహించ సాగాయి. మిత్రులవద్ద గద్గద స్వరంతో శలవు తీసుకొని బయలుదేరారు. మరికొందరు ఉల్లాసంగావుంటే మరి కొందరు ఆనాటి కార్యక్రమాల్లో పూర్తిగా మునిగిపోయున్నారు. అయితే అందరూ ఆనాటి అదృష్టాన్ని గురించి సంతృప్తిచెంది మెల్లగా మహాబలేశ్వర్ వదిలారు.

మహాబలేశ్వర్‌లో ఆనాడు పాతజీవితపు శిష్యులు, భక్తుల వల్ల వసూలైన మొత్తం రు. 23,568-14-0 ఆ మొత్తాన్ని దాదాపు 218 మంది సమర్పించుకున్నారు. బాబా విశిష్టపద్ధతిలో ఒక ప్రత్యేక కార్యక్రమం చేయ సంకల్పించుటచేత ఆ పైకాన్ని దానికై వినియోగించ దలిచారు.

ఆనాటి సమావేశంలో వసూలైన పైకం వివరంముందుగా ఎవరికీ తెలియదు. ఈరుచ్ క్రాపు చేయించుట కనుమతించ బడుటచేత అతడొక మంగలి దుకాణానికి వెళ్ళాడు. ఆనాడు వసూలైన మొత్తం వివరం ఈరుచ్ కంటే కూడ ముందుగా

ఆ మంగలికే తెలిసింది. ఈరుచ్ దుకాణానికి వెళ్ళి కుర్చీలో కూర్చోగానే ఆ మంగలి పలుకరిస్తూ "బాబయ్యా! యీవేళ మీకు చాలా మంచిరోజు కదండీ?" అన్నాడు. "ఏం? ఎందుకలా అంటున్నారు?" అని ప్రశ్నించాడు ఈరుచ్. "బాబాగారు భారత దేశంలో వున్న తన ప్రేమికులందర్నీ ఈవేళ యిక్కడకు పిలిపించారు కదా!"

"నీకెలా తెలుసును?" "ఏమోబాబూ! వచ్చిన వాళ్ళంతా చెప్పుకుంటుంటే విన్నాను. అంతా మా దుకాణం మీదగానే వెళ్ళాలికదా బాబూ! ఇవాళ డబ్బు బాగా వసూలైందని వాళ్ళు చెప్పుకుంటుంటే విన్నానంతే!" అని బదులిచ్చాడు మంగలి.

"చాలా వసూలై వుండవచ్చును. కానీ అదంతా బాబా కార్యక్రమం కోసరమే వుపయోగిస్తారు" అని సర్ది చెప్పాడు ఈరుచ్.

"సర్లెండి బాబూ! అది దేనికైతే నాకేంగాని నా వుద్దేశ్యంలో యీవేళ షుమారు రు. 25,000 లు వసూలై వుండవచ్చను కుంటున్నాను" అన్నాడు. నిజానికది గాలివార్తే అయినా, ఆ మంగలి ద్వారానే యీరుచ్ ముందుగా కొంతవరకు వసూలైన పైకపు విషయ సేకరణ చేయకలిగాడు.

## ఆర్తులకు సహాయం

ఆనాటి సమావేశం ముగియగానే బాబా ముందుగా నిర్ణయించుకున్న ప్రకారం, తాను తలపెట్టిన మస్తు కార్యక్రమం,

పేదల కార్యక్రమం నిమిత్తం, భారత దర్శన ప్రయాణాన్ని ప్రారంభించాలని నిశ్చయించారు. ఇండియాలో పేదవాళ్ళను వెతకాల్సిన అవసరం లేదు. సహాయం చేసేందుకై వాళ్ళను వెతుకుట పెద్ద కష్టమేమీ కాదు. అయితే అలాంటి పేదవారికి సహాయపడుట కాక, ఒక విశిష్ట పద్ధతిలో, ఒకప్పుడు బాగా బ్రతికి, యిప్పుడు సర్వమూ కోల్పోయి, అతి నికృష్ట జీవితం గడుపుతున్న కుటుంబ యజమానికి పెద్ద మొత్తంలో పైకం ముట్టచెప్పుటొక కార్యక్రమం.

నవజీవనం పేదలకు సహాయం చేయుట ఒక సరికొత్త ఘట్టం. అలా చేయుటలో గల కారణాన్ని బాబా ఎవరికీ చెప్ప లేదు. ఆయన ఉద్దేశ్యాన్ని తెలుసుకొనేందుకు మండలివారెన్నడూ ప్రయత్నించనూ లేదు. బాబా చేసే ప్రతిచర్య నిస్వార్థమైందని, ఆయనద్వారా దైవేచ్ఛ అలా ప్రత్యక్ష మవుతుందన్న ప్రగాఢ విశ్వాసంతో వుండేవారు.

ఆ రోజుల్లో బెంగాల్ రాష్ట్రం కరువు కాటకాలతో అట్టుడికి పోతోంది. ఎందరో అన్నార్తులై మృతి చెందారు. ప్రభుత్వంచే సహాయ కేంద్రాలు నెలకొల్పబడినాయి. కొన్ని మత సంస్థలు కూడ అనేకచోట్ల, సహాయ కేంద్రాలు నడిపాయి. అటువంటి పరిస్థితుల్లో, ఆకలితో అలమటించే మానవాళికి, ఇంతమంది యిన్ని రకాల సహాయా లందిస్తుండగా, బాబా నవజీవనం గడుపుతూ కూడ, బెంగాల్లో పేదవారికి సహాయపడాలని సంకల్పించారు.

మహాబలేశ్వర్ నుండి బయలుదేరేందుకు ముందుగానే ఒక పథకం తయారు చేయించారు. క్యాలెండర్లు, మ్యాపులు, రైల్వే టైంటేబిళ్ళు దగ్గర పెట్టుకొని, నానాతంటాలు పడి, రెండు నెలలు పాటు సాగే పర్యటనా కార్యక్రమాన్ని తయారు చేశారు. దాని ప్రకారం బాబా, పెండూ, గుస్తాద్‌జీ, యారుచ్, బైదుల్, ఛగన్‌లతో అక్టోబరు 21-వ తేదీన బయలుదేరారు.

ఈ పర్యటనలో బాబా మస్తు కార్యక్రమంతోపాటు, పేద వారి కార్యక్రమం కూడ సాగించారు. పేదవారితో ఖర్చుపెట్టే డబ్బుకంటే, మస్తుపనికి డబ్బెక్కువ ఖర్చు చేయవలసి వచ్చేది. బాబా బెంగాల్ చేరేముందు దారిలో బీహార్ రాష్ట్రంలో పర్య టించారు. అప్పట్లో కోసీనది పొంగి ప్రవహించి, విపరీత వరదలు సంభవించిన దృష్ట్యా, బీహార్‌లోని కొన్ని జిల్లాల్లో విపరీత నష్టం సంభవించింది. అనేక గ్రామాలు తుడుచుకు పోయాయి. లక్షలాది రైతులు దిక్కులేక నానా అవస్థలు పడ్డారు. ప్రభుత్వపరంగానూ, అనేక సాంఘిక సేవా సంస్థల ద్వారానూ చేసే సహాయం నెమ్మదిగా సాగుతోంది.

ఆ సందర్భంలో బాబా దాదాపు నాలుగైదు గ్రామాలు తిరిగి, వరద బాధితులకు కొంత ధన సహాయం చేశారు. నిస్వార్థంతో ప్రభుత్వ పరంగా సంఘసేవ చేస్తున్న ఒక కాంగ్రెస్ కార్య కర్తను గుర్తించి, వరద దెబ్బతిని సర్వమూ కోల్పోయా డని తెలుసుకొని, అతనికి కూడ కొంత ధన సహాయమందించారు. మరో పూళ్ళో, 200 మందికి పాదాలు స్పృశించి, నమస్కరించి,

ఒక్కొక్కరికి అయిదేసి రూపాయలిచ్చారు. మరి కొన్ని కుటుంబాల వారికి యింకా పెద్ద మొత్తంలో రు 50-00ల నుండి రు 500-00 ల వరకూ ముట్ట చెప్పారు.

వారికి ధన సహాయ మందించే సమయంలో, అది, కొందరు ధర్మాత్ములందించిన సహాయమని చెప్పేవారు. వారికి సహాయం చేసేముందు, బాబా ప్రతి వారి కాళ్లు కడిగి, శిరసుతో వారికి ప్రణమిల్లే వారు. "నా సోదరుడు, యీ సొమ్మును మీ కిస్తున్నాడు. తీసుకోండి. కొందరు దయార్ద్ర హృదయులు, కొంత డబ్బిచ్చి, అవసరమున్న వారికి, అర్హులైన వారికి సహాయం చేయమని కోరారు. అట్టి సొమ్మునే, యిప్పుడు మీకు మా అన్న యిప్పిస్తున్నారు. యిదేదో ధర్మంగా యిస్తున్నారను కోకండి. యీ డబ్బు తీసుకుంటే మీరు ఋణపడి వుంటారను కోకండి. ఇది కేవలం ప్రేమతో ఇస్తున్నది" అని చెప్పించేవారు.

బాబాతో వున్న శిష్యులు, "మాఅన్నగారు" ఇలా చెప్ప మన్నారని చెప్పేవారు కానీ, ఆయన పేరు మాత్రం చెప్పేవారు కారు. నవజీవన నియమాల ననుసరించి, బాబా పేరు బయట పెట్టలేదు. ఆయన పేరు చెపితే అత్యంత గౌరవం చూపిస్తారు. అది తప్పించాలనే అలా చేశేవారు అర్హులైన బీద వారికి డబ్బుపంచ డంతోపాటు మస్తుల సాంగత్యం కూడా చేశేవారు. బీహార్‌లో చాలా వూళ్లు బాబా సందర్శించారు. వెళ్లిన ప్రతి చోటా అర్హత కలిగిన కుటుంబాల్ని ఎంపిక చేసి 5 రూపాయల నుండి 500 రూపాయల వరకు ఆర్థిక సహాయ మందించారు.

బీహారులో వరదబాధితుల సహాయం పూర్తి చేసుకొని నేపాళదేశం వెళ్లారు. జనక మహారాజు రాజ్యం చేసిన మిధిలా నగరంతో పాటు అనేక చోట్ల సాధువుల సాంగత్యం చేశారు. ఆధ్యాత్మికంగా అభివృద్ధి చెందిన మస్తులెందరోకలిశారు. నేపాల్ నుంచి బాబా బృందం కలకత్తా వచ్చారు. అప్పటికి మహాబలేశ్వర్ నుంచి బయలుదేరి 11 రోజులైంది. దారిలో ప్రయాణం వ్యయ ప్రయాసలతో కూడుకుంది. కనీసం రోజుకో గంటైనా విశ్రాంతి దొరక నందున బాబా కలకత్తాలో నాలుగు రోజుల పాటు విశ్రాంతి తీసుకున్నారు.

ఆ తర్వాత కొందరు మస్తుల్ని కలిశారు. వూరూరు తిరిగి, ఇంటింటికీ వెళ్లి ఎంతో ఆవేదనా హృదయంతో పేదలకు సహాయ పడుటకు ప్రయత్నించారు. అన్నార్తులకు ఆహారం పంచారు. క్షుద్బాధా నివారణకై వారికి సేవా, శుశ్రూషలు చేస్తూ అన్ని విధాలా వారికి సహాయ పడ్డారు. అలా వారు సహాయ మందించుటలో ఆయనతో వున్న మిత్రులు ఎంతో సహాయ పడ్డారు. వారక్కడ వున్నట్లుగానీ, వారేమి చేస్తున్నారో కూడ ఎవరికీ తెలిసేది కాదు.

కలకత్తాకు దగ్గర్లోనే దక్షిణేశ్వర్ అనే వూరులో కాళీ దేవాలయం వుంది. యీ ఆలయ ప్రాంగణంలోనే రామ కృష్ణ పరమ హంస పౌరోహిత్యం చేశారు. ఆయన యీ దేవాలయం లోనే ధ్యాన నిమగ్నుడై దైవ సాక్షాత్కారం పొందాడు. దీనినే కాళీఘాట్ అంటారు. ఆ రోజుల్లో కలకత్తా కది కొన్ని మైళ్ల

దూరంలో వున్నా, ప్రస్తుతమది మహా నగరానికి వుప నగరంగా భాసిల్లుతోంది. రామకృష్ణ పరమహంస వున్న గది, వాడిన వస్తువులు, పడక మున్నగునవి యీ నాటికీ అక్కడ భద్రపరచ బడినవి.

బాబా కలకత్తాలో వుండగా కాళీఘాట్‌లో కొన్నాళ్లుండ దలచినట్లు వెల్లడించారు. తాను చేయదలచు కున్న కార్య క్రమాన్ని కొనసాగించేందుకు, ఆ ప్రాంగణంలోని, భోజనశాలను ఎన్నుకున్నారు. రామకృష్ణుడీ భోజన శాలలోనే భగవత్సా క్షాత్కారం పొందాడు. ఆయన శిష్యులు సేకరించి తెచ్చిన ఆహారాన్ని యీ శాలయందే వినియోగించే వారు. కాళీఘాట్‌లో కాళీమాత ఆలయాని కిరువైపులా అనేక చిన్న భవనాలు చిన్న దేవాలయాలు ఎన్నోవున్నై. అన్నివున్నా బాబా యీ భోజన శాలనే తన కార్యక్రమం చేయుటకు ఎంచుకున్నారు.

ఆ హాలు అతి పవిత్రమైన ప్రధానగదిగా భద్రపరచుటచేత, దానిని బాబా కార్యక్రమము కొరకు వుపయోగించేందుకు అనుమతి పొందుట అతి కష్టమైంది. అయినా బాబా ఆజ్ఞ పాటించి శిష్యులు తగు ప్రయత్నంచేశారు. మేనేజరుని కలిసి, కొంత తడవు వారంతా భోజన శాలలో గడుపుటకు అనుమతించవలసిందిగా అభ్యర్థించారు. అందుకాయన అభ్యంతర పెట్టలేదు.

ఆ భోజన శాల ఒక సామాన్యమైన గది. ఆవుపేడతో అలకబడి వున్నది. ఏ విధమైన కొయ్యసామగ్రి లేదు. పీట వేసుకొని విస్తట్లో భోజనం చేయాలి. బాబా బృందంతో

ఆ గదిలో ప్రవేశించారు. కొంతతడవైనతర్వాత, శిష్యులందర్నీ బయటకు పంపి, తన దుస్తులన్నీ వూడదీశి, కేవలం లంగోటీ మాత్రం వుంచుకొని, తానొక్కడే కటిక నేలపై కూర్చున్నారు. తలుపులు మూసి, శిష్యులు బయట వుండిపోయారు. లోపల ఆయన ఏమిచేశారో ఎవరికీ తెలియదు.

ఓగంట గడిచాక చప్పట్లుకొట్టారు. అప్పుడు శిష్యులంతా లోనికెళ్ళారు. బాబా మళ్ళీ గుడ్డలేసుకొనివున్నారు. నవజీవన పుదుపులు, బారుగౌను, తలపాగా ధరించివున్నారు. యిప్పుడొక అతిముఖ్య కార్యక్రమం చేయవలసి వున్నందున, శిష్యులందరినీ తాను జారీచేసే ఆజ్ఞలను పాటించమని హెచ్చరించారు. అయన ముందుగా తన ఆజ్ఞను యీరుచ్‌కి యిచ్చారు. అతను తన వెంటనే అనుసరించాలని, తానిప్పుడు స్వయంగా భిక్షకు బయలుదేరుతున్నట్లు తెలియచేశారు. బాబా వెనుక పెండూ ఒక సంచినిండా రూపాయి నాణాలు చిల్లర వుంచుకొని బయలుదేర మన్నారు. అతని వెనుక తక్కిన మండలి వుండాలి. ఇదీ బాబా ఆజ్ఞ.

ఏకాంత కార్యక్రమం పూర్తికాగానే బాబా గది బయటకు వచ్చిన నవజీవన దుస్తులతో భిక్షకు బయలుదేరారు. యీరుచ్ ప్రక్కన వున్నాడు. పెండూ వెనుక నడిచాడు. అతని వెనుక తక్కిన సహచరులున్నారు. ఒక వైపు బాబా, భిక్ష నడుగుతూ నడుస్తుంటే, వెనుక వున్న పెండూ, పేదవాళ్ళకు నాణాలు తీసి పంచేవాడు. చిత్రం ! చూడండి ! ఒక వైపున బాబా ఆహారాన్ని

యాచిస్తూ మరో వంక, తానే అన్నార్తులకు పైకొన్ని పంచేవారు

భిక్షాటనకు బయలుదేరిన బాబా, కాళీమాత దేవాలయ ప్రాంగణాన్ని వదలి బయటకు వచ్చిం తర్వాత, సహచర మిత్రులతో రోడ్డు మీదకు బయలుదేరారు. దారిలో వున్న అనేక దుకాణాలు, బాట కిరువైపులా, అగరొత్తులు కాళీ విగ్రహాలు, రామకృష్ణుని ఫొటోలు, వివేకానందుని ఫొటోలు, ఇంకా ఎన్నో రకరకాల వస్తువులు, మామూలు యాత్రా స్థలాల్లో వుండే టటువంటి అన్ని రకాల దుకాణాలు క్రిక్కిరిసి వున్నాయి. వాటిని దాటుకుంటూ పెద్ద రోడ్డుపైకి చేరారు. అక్కడ మిత్రులతో యిహ యాచన మొదలెడదామన్నారు.

బాబా క్రిందికీ పైకి చూచి, తా మే ప్రక్కగా బయలు దేరాలో నిర్ణయించారు. ఒక సందులో యాచన మొదలు పెట్టారు. మొదటి రెండు మూడిళ్లల్లో ఏ విధమైన అనుకూల జవాబు రాలేదు. లేదు పొమ్మన్నారే కానీ ఎవరూ భిక్ష పెట్టలేదు. అసలెవరూ బయటకు రాలేదు. అథవా వచ్చినా లేదు పొండి, పొండి అన్నారు. యిారుచ్ " మా, భిక్షాదీజియే,. (తల్లీ, భిక్షపెట్టండి)అని అంటూంటే అతని స్వరానికనుగుణంగా బాబా సౌంజ్ఞలుచేశారు. సమయస్ఫూర్తితో ఆయన చేసే హావభావాలు, ఎవరు పిలిచారో తెలుసుకోలేని విధంగా సరిపోయేది. చూచేవాళ్ళకు బాబాయే స్వయంగా పిలుస్తున్నట్లనిపించేది. " మా ప్రేమసే భిక్షాదీజియే "అని యిారుచ్ అనగానే, బాబా తన జోలెను, క్యారేజి గిన్నెను ముందుకు చాచి వుంచేవారు. ఆ సన్నివేశం, తానే

అడుగుతూ జోలె పట్టినట్లనిపించేది. ఆ జోలె, యి త్తడి క్యారేజీ యిప్పటికీ, మెహెర్‌బాదు కొండమీద మ్యూజియంలో భద్రపరచబడినవి.

యిలా ఆరోడ్డులోవారు భిక్షనర్థిస్తూ బయలుదేరింతర్వాత, నిర్లిప్తంగావున్నవారు కొందరైతే లేదు పొమ్మని తిరస్కరించిన వారు మరికొందరు. ఇంకొందరు, ప్రక్క యింటికెళ్ళి యాచించ మని ఉచిత సలహా చెప్పారు. అయినా బాబా ఆనాటి యాచనకెంతో ప్రాముఖ్యతనిచ్చి, ముందుకు సాగుతూ, యింటింటికీ తిరిగి భిక్ష అడుగుతూ, ఒక యింటిముందు ఆగారు. హృదయాన్ని కదిలించివేసే సంఘటనొకటి అక్కడ జరిగింది.

మామూలుగానే యీరుచ్, "మా భిక్షాదీజియే" అని బిగ్గరగా పిలిచాడు. ఒక చిన్నపాప ఇంట్లోంచి బయటకు వచ్చి, గుమ్మంలో వున్నవారిని చూచి, పరుగున లోనికెళ్ళి పెద్దవాళ్ళతో ఎవరో యాచనకొచ్చారని చెప్పింది. అంతలో ఆడవాళ్ళిరువురు వచ్చి బయటవున్నవారితో, "అయ్యా, కాసేపాగితే గబగబా వంట తయారుచేసి భిక్షపెడతాం. ఎంతో ఆలశ్యంకాదు. కొద్దిసేపట్లోనే తెస్తాం. మాభిక్ష తీసుకోకండా మీరుకదలవద్దు. దయచేసి ఆగండి. క్షణాల్లో తెస్తాం అన్నారు.

అప్పుడు బాబా, యీరుచ్‌తో ,"మేము మా బృదంలో ఏడుగురమున్నాం. మీరు పెట్టేభిక్ష మా ఏడుగురికి సరిపోవాలని చెప్పమని సౌంజ్ఞచేశారు. అతడావిషయాన్ని ఆడవాళ్ళతో చెప్పగా, " ఓ! మీకేంబాధలేదు. మీఅందరికీ సరిపడినంత తయారు చేస్తాం.

కాకపోతే కొంచెంసేపు ఆగండి. అంతే చాలు" అని అర్థించి గబగబా తమపనిలో నిమగ్నమయ్యేందుకు లోనికి వెళ్ళిపోయారు.

అయిదు నిమిషాలాగి, బాబా వాళ్ళను భిక్ష తెమ్మనమని పిలవమన్నారు. యీరుచ్ కేకతో పాపమా స్త్రీలు కంగారుతో వచ్చి, "అయిపోవచ్చింది వెళ్ళిపోకండ"ని చెప్పివెళ్ళారు. వాళ్ళెన్నో రకాల పదార్థాలు వారికి తయారు చేస్తున్నారు. బాబా మళ్ళీ పిలిపించారు. అంతే. పరుగు పరుగున, ఆయింట్లో వున్నపిల్లా జెల్లాతో సహా స్త్రీ పురుషులంతా కలసి రకరకాల పదార్థాలతో కూడిన భోజనాన్ని బృందమందరి జోలెలు నింపారు. నిజంగా వారెంత అదృష్టవంతులోగదా!జోలెలు నిండాయి. క్యారేజీలు నిండాయి. బాబా ఎంతో ముగ్ధులైనారు. ఆమె కుటుంబము ఎడల తన ఆనందాన్ని వ్యక్తపరచారు. దానితో భిక్ష ఆపి వెనుతిరిగారు. అదే ఆఖరి భిక్ష. ఆ పిమ్మట ఎన్నడూ భిక్షనర్థించలేదు.

ఆనాటి భిక్ష పూర్తిచేసుకొని, చాలాదూరం తీసుకువెళ్ళి మిత్రులందర్నీ ఒక చెట్టుక్రింద కూర్చోపెట్టి, సేకరించిన భిక్షను మిత్రులందరికీ పంచిపెట్టి, తినమన్నారు. ఆతర్వాత దారివెంట వుండే యాచకులకు అడిగిన వారికి లేదనకుండా డబ్బులు పంచిపెట్టమని పెండూను ఆదేశించారు. అలా పంచేప్పుడు కొందరికి అయిదారురూపాయలుదాకా ముట్టేవి.

## పేదల కార్యక్రమం

కలకత్తానుంచి, బయలుదేరి ఒరిస్సాలో కటక్ పట్టణం చేరారు. అక్కడ ఒక పెద్ద గృహస్తుకు రు 500 ధన

సహాయం చేశారు. ఒకప్పుడు బాగా బ్రతికి, యిప్పుడు చితికిపోయి, ఆర్థిక యిబ్బందులతో నానాయాతనలు పడుతున్న కుటుంబాల్ని అన్వేషించి, ఆర్థికంగా సహాయపడటం ప్రస్తుత కార్యక్రమం. ఇది చాలా కష్టతరమైన వ్యవహారం. కటిక పేదవారిని వెదకి తీసుకు రమ్మని పంపినప్పుడు, అటువంటి యధార్థమైన పేద వ్యక్తుల్ని వెదకి తెచ్చుట ఎంతో కష్టమయ్యేది. అలా పైకము అవసరమున్న వారు తమ చేయి చాచి, యాచించు వారై యుండకూడదు. వారు ఒకప్పుడు బాగా బ్రతికిన భాగ్య వంతులై వుండి, పరిస్థితుల ప్రభావంవలన, తమ సంపదను, ఆస్థి పాస్తులను, సర్వస్వాన్ని కోల్పోయి వుండాలి. అలాంటి ప్రత్యేక తరహా పేద వ్యక్తుల్ని వెదకమనేవారు.

యిళ్లముందు యాచించే ముష్టివాళ్లైతే యిండియాలో కోకొల్లలు. వీరు కాదు బాబాకు కావలసింది. యాచించుటలో కూడ వారు బయటపడలేరు. అంత మాత్రంతో వారిని గర్విష్టు లని కూడ అనలేం. వారు అహం భావ రహితులు. వారేదీ కోరరు. వారున్న స్థితిని యితరులు గుర్తుంచుట కంగీకరించరు. అందు వలన ఇట్లాంటి వారిని కనుగొనుట శిష్యులకు చాలా దుర్ల భమయ్యేది. అయినా బాబా స్వయంగా శ్రద్ధ తీసుకొని, వారిని కనుగొనేవారు. కనుక్కోవట మంటే ఒక రకంగా అది సత్యమే. ఎందుకంటే, బాబా సర్వజ్ఞుడు కదా! ఆయన తలచు కొంటే, అటువంటి వారు ఆయన చెంతకు క్షణాల్లో చేర గలరు.

కానీ యిక్కడ, ఆయన అనుగ్రహానికి సంబంధించిన, యధార్థం ఒకటున్నది. అది అనంతమైన కరుణామయత్వం శిష్యుల్నాయనయొక్క కార్యక్రమాల్లో పాల్గొనుట కనుమతించారు. అట్టి పేదవార్ని గుర్తించ వలసిన వారు వారేనన్న భావం, వారిలో కలిగేట్లు చేశారు. ఆ పిమ్మట, ఆ సంఘటనలో వారు కూడ పాల్గొని ఆనందించేట్లు చేసేవారు. శిష్యులు సర్వకాల సర్వా వస్థల యందు, బాబా తమతోనే వున్నట్లు భావించేవారు. యదార్ధంగా అవుసరమున్న వ్యక్తుల కొరకు శిష్యులు ఎలా అన్వేషించే వారో ఒకటి రెండు సంఘటనలు, తెలుసు కుందాం.

## గూడూరు సంఘటన

కరువులో అన్నార్తులై అలమటిస్తున్న వారికి సహాయపడి కావలసినవి సమకూర్చి అయిగురు శిష్యులతో దక్షిణాభి ముఖంగా బయలుదేరారు. ప్రయాణాల్లో దారి వెంట సాధారణంగా చిల్లర నాణాల్ని బీదవారికి, ప్రణామాలు వగైరాలు లేకుండానే యిచ్చేవారు. బాబా నవజీవనం నుండి ఒక్క రోజు పూర్వ జీవనంలో ప్రవేశించి బాబా ప్రేమికుల చేత సమర్పించ బడిన ప్రేమ కాను కలను, బీదవారి కోసరం యిలా వినియోగించారు.

బాబా బృందం ఒరిస్సా రాష్ట్రం తర్వాత మద్రాసు చేరారు. మద్రాసులో వుండగా ఒక రోజున బాబాకు దాహమైంది. మంచి నీళ్ల కొరకు అటు యిటూ చూచారు శిష్యులు. అంత సుదీర్ఘ ప్రయాణంలో కూడ, బాబా ఎన్నడూ తన కోసరం, వసతి సదు

హాయాలకు కానీ, భోజన సౌకర్యాలకుగానీ, ప్రత్యేక శ్రద్ధ తీసుకోలేదు. శిష్యులే ఆయన అవుసరాలు తీర్చే భాద్యత తీసుకొనే వారు. అది వారికిచ్చిన మహద్భాగ్యంగా భావించే వారు. బాబా దాహం అనగానే యూరుచ్‌కి దగ్గర్లోనే వున్న కొబ్బరిబొండాల దుకాణం కనపడింది. కొబ్బరి నీళ్ళంటే ఆయన కిష్టం కనుక బొండాం కొట్టించి నీళ్ళు తెచ్చి దాహం తీరుద్దామను కున్నాడు.

బాబాను తక్కిన మిత్రులతో దుకాణం ప్రక్కనే వుంచి, తాను దుకాణంలోకి వెళ్లి కొబ్బరిబొండాలు బేరం చేశాడు. ధర ఎంతో బేరమాడి, బొండాం కొట్టిస్తున్నాడు. అంతలో మరో కొతాదారు వచ్చి, ఆ దుకాణదారునితో ఒక వున్నత కుటుంబీకుడు బాగా బ్రతికి, తన సంపదనంతా పోగొట్టుకొని, యీడొచ్చిన కూతురుతో యిప్పుడు దరిద్ర జీవితాన్ని ఎంత దుర్భరంగా గడుపుతున్నాడో, చెపుతున్నాడు.

వారి సంభాషణంతా యూరుచ్ గుంభనంగా విన్నాడు. దాహంతో వున్న బాబాదప్పిక తీర్చుటకై చెక్కిన కొబ్బరి బొండాన్ని తీసుకొని గబగబా ఆయనను సమీపించాడు. అప్పటి వరకూ దుకాణాదారునితో జరుగుతున్న సంభాషణ దగ్గర్లోనే వున్నందువలవ బాబాకూడ విన్నారు. అంచేత యూరుచ్‌ని మళ్ళీ, సంభాషణంతా పూర్తిగావినిరమ్మన్నారు. యూరుచ్ మళ్ళీ వెళ్ళి వారి మాటలతో శృతి కలిపాడు అంతావిన్నాక, ఆ వ్యక్తిపేరు, వూరు, వివరాలనుగురించి వాళ్ళనడిగాడు.

ఆయనపేరు, వూరు, చిరునామా, ఇంటికిచేరేమార్గం అన్నీ వివరంగా తెలుసుకొని బాబాతో జరిగిందంతా చెప్పాడు. ఆ

వ్యక్తివుండేది ఆంధ్రదేశంలోని గూడూరు పట్టణం. మద్రాసుకు షుమారు 100మైళ్ళదూరంలో వుంది. బాబా కొబ్బరినీళ్ళ త్రాగటం పూర్తికాగానే యీరుచ్ చెప్పిన అడ్రసుప్రకారం ఆ వ్యక్తిని కలిసేందుకు వెంటనే రైలుపై గూడూరు బయలుదేరారు. వారిరైలు గూడూరు చేరేసరికి సంధ్యవేళ దాటింది. చీకటి పడవచ్చింది. అందులో ఆనాడు దీపావళి పండుగ పర్వదినం. వూరంతా టపాకాయల మోతలతో ప్రతిధ్వనిస్తోంది.

అటువంటి పరిస్థితుల్లో బాబాతో వూళ్ళోకివెళ్ళటం మంచిది కాదని తలచి, శిష్యులారాత్రికి ప్లాటుఫారంపైనే విశ్రమిద్దామని బాబాకు నచ్చచెప్పారు. రాత్రిపూట నగరంలో రోడ్లంట వెళ్ళటం శిష్యులకిష్టం లేనందున, బృందమంతా రైల్వేస్టేషనులోనే వుండిపోయారు. తోటిమిత్రులతో బాబా ప్లాటుఫారంపై ఒక మూల విశ్రమించారు. ఆచూకీ తెలుసుకుందామని యీరుచ్ తనదగ్గర వ్రాసివుంచుకున్న చిరునామాప్రకారం వెతుక్కుంటూ వంటరిగా వీధులన్నీ తిరుగుతూ, ఆ వ్యక్తి యింటిజాడ వెదికాడు.

చివరికెలాగో ఆ చిరునామాదారుని యిల్లు కనుక్కున్నాడు. తీరాచూస్తే అది సకల సదుపాయాలున్న మిరుమిట్లుగొలిపే బ్రహ్మాండమైన భవంతి. ద్వారంచెంతకు చేరి తలుపు తట్టాడు. ఎవరో లోపలనుండి, "ఎవరు కావాలని" అడిగారు. తన వద్ద వున్న అడ్రసులోని వ్యక్తిపేరు చెప్పి "ఫలానా వ్యక్తి కావాలి వారిల్లిదేనా ?" అని అడిగాడు. అంతలో ఆజాను బాహుడైన ఒకాయన బయటకు వచ్చి "యిదే వారి యిల్లు. మీకేంకావాలి ?" అని అడిగాడు. యీరుచ్‌కి మతిపోయింది. చూచుటకది ఒక

జమీందారీఫాయివారిల్లులా వుంది. ఇతనికేమి చెప్పాలోతోచలేదు. అవాక్కైపోయాడు. అది తాము సహాయం చేయవలసినవారిల్లు కాదనుకున్నాడు.

"మీకెవరు కావాలి ?" "నాకు ఫలానా వ్యక్తికావాలి." అందుకాయన "నేనే ఆవ్యక్తిని" అన్నాడు. "ఏం పనిమీద వచ్చారు ? మీకేంకావాలని" అడిగాడు. "క్షమించండి. ఏదో పొరపాటు జరిగింది. యీ పేరుగల వ్యక్తి సహాయం పొందే అవుసరం కలిగివున్నాడు. ఆయన అవుసరానికాదుకోవాలని ఆయనకొరకు వెదుకుతున్నాను." అన్నాడు యీరుచ్. అందుకు ఆయన కల్పించుకుంటూ, నాపేరు కలవారు యింకెవ్వరూ యీ వూళ్ళోలేరు. మరి భగవంతుని దయవలన మాకే లోపం లేదు. నాక్కావలసిన సకల సంపదలున్నవి. నా అవసరాలన్నీ ఆ దైవమే తీరుస్తున్నాడు. అయితే మీరు తెలుసుకున్న ఆ చిరునామాలో ఏదో పొరపాటు జరిగింది. నాకెవరి సహాయమక్కర్లేదు" అని చెప్పాడు.

చేసేదిలేక యీరుచ్ వెనుదిరిగాడు. తానేమిచేయాలో బాబా కేమిచెప్పాలో పాలుపోక నిరాశ, నిస్పృహలతో వెనుతిరిగిన యీరుచ్‌కి, ఒక పసివాడు ఎదురొచ్చి సమయానికి దారిచూపాడు. ఆ పిల్లవాడు కాన్వెంటులో చదువుతున్నాడో ఏమో, చక్కని ఆంగ్ల భాషలో పలకరిస్తూ మీరు చెప్పిన పేరుగలాయన నాకు తెలుసును. ఆయనిల్లు చూపిస్తానుర్రమ్మంటూ వెంబడించాడు. తండ్రి ఎంత వారిస్తున్నా వినిపించుకోవకుండా బయలుదేరాడు. వీళ్ళకు

కావలసిన వ్యక్తిపేరు యీ ఇల్లుగలాయనపేరు ఒకటే. అది తెలిసిన యజమానికొడుకే యీ పసివాడు.

ఇల్లుగలాయన ఒక పెద్ద కాంట్రాక్టరు. అదే పేరుగల మరో సంపన్నుడు, ఒక యిల్లు కట్టివ్వమని యీయనకు కాంట్రాక్టు యిచ్చాడు. ఇల్లు తయారైంది. కానీ వూహించని పరిణామా లెదురై అవ్యక్తి దివాళా తీశాడు. పేదవాడై పోవుటతో కాంట్రాక్టరుకు చెల్లించవలసిన పైకం కట్టలేకపోయాడు. దాంతో తాను కట్టించిన ఇంటిని ఆ కాంట్రాక్టరు స్వంతం చేసుకున్నాడు. నిజానికీవిధంగా దరిద్రమనుభవిస్తున్న ఆ వ్యక్తి తనకు తెలిసినా బయటపెట్టలేకపోయాడు. కానీ తనకొడుకే యిప్పుడు దారి చూపిస్తున్నాడు.

సందులు గొందులు తిప్పి ఒక చోట ఆగాడు. అది కడు పేదలుండే పరిసరాలు చాలా పేదవారుండే బజారది. ఎంత పేద బజారైనా, ఆనాడు దీపావళి పండుగ కనుక, ఆ బజార్లో కూడ దీపకాంతులు వెలుగుతూనే వున్నాయి. ఎంత పేదవారైనా కనీసం ఒక్క ప్రమిదన్నా వెలిగించారు. కానీ ఒక యింట్లో మాత్రం ఏ వెలుతురూ లేదు. వెలవెలపోతూ కనపడింది. అంత దూరంలో వుండవగానే, ఆ పిల్లాడు"ఆ యిల్లే మీరడిగినాయన దని" చెప్పి వెళ్ళిపోయాడు.

యీరుచ్ మెల్లగా అడుగులేసుకుంటూ చీకట్లో ఆ యింటి గుమ్మం వద్దకు చేరాడు. తలుపు తెరిచే వుంది. లోపలి కెళ్ళి చూస్తే ఎవరూ కనపడలేదు. ఏ విధమైన సరంజామా లేదు.

ప్రక్క గదిలో చిన్న ప్రమిద మినుకు మినుకు మంటున్నది. ఆ మసక వెలుతురులో నిలువెత్తున్న కృష్ణుని విగ్రహం ముందో యువతి సాగిలపడి ధ్యానం చేస్తూ కనపడింది. ధ్యానంలో మునిగివున్న ఆ యవ్వనవతి మౌనాన్ని భగ్నం చేయుట యిష్టం లేక నిలబడి పోయాడు. కానీ క్రమ శిక్షణ కలవాటుపడిన, సుశిక్షితుడుగా ప్లాటు ఫారంపై బాబాసు వదలి వచ్చినందున, తను వచ్చిన పని పూర్తిచేసుకొని తన రాక కెదురు చూచే బాబా చెంతకు చేరాలని సంకల్పించు కున్నాడు.

గుమ్మంలో వుండే, తలుపు తట్టాడు. అలికిడి విని ఆమె వెను తిరిగి యీరుచ్‌ని గమనించింది. నీరసంగా లేచి బయటకు వచ్చి ఏం కావాలి బాబూ జీ! అన్నది. చక్కని ఇంగ్లీషులో పలకరించేసరికి ముగ్ధుడైన యీరుచ్ నన్ను మా పెద్దన్నయ్య యిక్కడకు పంపితే వచ్చాను. ఆయనిప్పుడు రైల్వే స్టేషనులో వున్నారు. యీ ఇంట్లోనే వుండే ఫలానా వ్యక్తిని కలవాలని కుతూహల పడుతున్నారు. ఆ పేరు గల వ్యక్తి వున్నారా ? అని అడిగాడు. ఆశ్చర్యవదనంతో 'వున్నారండి ! ఆయన మా నాన్నగారు. రండి చూద్దురుగాని ' అంటూ ఒక చిన్నగదిలోకి తీసుకు వెళ్ళింది.

మిణుకు మిణుకు మంటున్న చిన్న దీపం తప్ప గదంతా చీకటిగా వుంది. ఒక ప్రక్కగా నేలపై ఒక వ్యక్తి పడుకొని వున్నాడు. మరో ప్రక్క జబ్బుతో మూలుగుతూ మరో స్త్రీ పడివుండుట కూడ గమనించాడు. వారిరువురు తన తలిదండ్రులని పరిచయం చేసింది. తమ లేమిని గురించి ఏమాత్రం

బయటపడనీయక జాగ్రత్తపడుతూ, యీరుచ్ కూర్చుండుటకు పీటైనా వేయజాలక పోతున్నందుకు క్షమించమని ప్రార్థిస్తూ తన విచారాన్ని వ్యక్తపరచింది. అక్కడి వాతావరణానికి హృదయం చలించిన యీరుచ్ ఆమెను ఓదార్చాడు.

తను వచ్చిన పనేమిటో చెప్పమని ఆమె మళ్ళీ ప్రశ్నించింది. "మా అగ్రజుడు బొంబాయినుండి వచ్చారు. యిప్పుడీ పూరి రైల్వేస్టేషను ప్లాటుఫారంపై ఎదురు చూస్తున్నారు. ఆయనకు మీ నాన్నగారితో కొంచెం పని తగిలింది. ఆయన మనస్సులో మీకు కొంత సహాయం అందిలచాని సంకల్పించారు." అని జవాబిచ్చాడు. "ఆయనకు మా నాన్నగారెలా తెలుసు ?" అని ఆదుర్దాగా అడిగింది.

అదేమో నాకు తెలియదు. నీవు నాకోమాట యివ్వాలి. మేమేమీ పరాయివారం కాము. మీరంతా మాకు తెలిసినవారే. దయచేసి ఒకపనిచేయి ,నేను మా అగ్రజుడ్ని వెళ్ళి తీసుకువచ్చే లోగా యిల్లు వదలి ఎక్కడికీ వెళ్ళకు. ఇంట్లోనే వుండు " అని చెప్పాడు. అలాగే వారు వచ్చేవరకు ఎక్కడికీ వెళ్ళకుండా మేలుకొనే వుంటానని ఒట్టేసి చెప్పింది. మళ్ళీకలుద్దామంటూ శలవు తీసుకొని వచ్చిన దారంతా బాగా గుర్తుపెట్టుకొంటూ గబగబా స్టేషను చేరాడు.

తిన్నగా బాబాచెంతకు చేరాడు. జరిగిన కథంతా ఆయనకు వివరించాడు. అంతా విని, బాబా ఎంతో ఆనందించారు. మొదట్లో ఆ రాత్రికి ప్లాటుఫారం మీదే గడిపి, వుదయం వారిల్లు వెతుకుదా మనుకున్నా, కథ విన్న తరువాత వెంటనే ఒక ఒంటెద్దు బండిలో

ఆ చీకట్లోనే వారింటికి పెండూ, ఈరుచ్‌లతో బయలు దేరారు. ఒక గంటలో వారిల్లు చేరారు. ఆరోజుల్లో యిలాంటి ప్రత్యేక కార్యక్రమాలకవుసరమయ్యే సరంజామానంతా, తమతో మోసుకు వెళ్ళేవారు. ప్రేమభిక్ష సమర్పించవలసిన వ్యక్తియొక్క పాదాలు కడుగుటకవుసరమగు బేసిన్, బకెట్టు, నీరు కావాలి. వారిపాదాలు కడిగింతర్వాత తుడిచేందుకో టవలు, వారికివ్వదలుచుకున్నపైకం ఓ కవరులో పెట్టి సిద్ధంగా వుంచుకొనేవారు.

ఇలాంటి సందర్భాల్లో అవుసర సరంజామాలింకావున్నాయి. ముందుగా అవుసరపడిన వ్యక్తి గురించిన సంగతులన్నీ తెలుసుకోవటం ఒకఎత్తు. వారింటికి చేరాక బకెట్టులో సగానికి నీటిని తెచ్చి యీరుచ్ సిద్ధంచేయాలి. భిక్ష అవుసరమయ్యే వ్యక్తి యొక్క పాదాలుంచి కడుగుటకు సరిపడ్డ చిన్న బేసిను కావాలి. లేకపోతే నీరంతా నేలపై పడి మడుగౌతుంది.

ఈ సరంజామానంతటినీ తీసుకుని యీరుచ్, బాబాతో వారిల్లు చేరి, లోనికి వెళ్ళి తన అగ్రజుని ముందుగా ఆ యువతికి పరిచయం చేశాడు. ఆమె తల్లిదండ్రులు వచ్చిన అతిధుల్ని కనీసం పలకరించేందుక్కూడ ఓపికలేక నీరసంతో వ్యాధిగ్రస్తులై వున్నారు. వెంటనే బాబా ముందుకువంగి, పడుకొనివున్న ఆ వ్యక్తిపాదాలక్రింద బేసిను వుంచి, నీళ్ళుపోయమని యీరుచ్‌కి సౌంజ్ఞచేశారు. బాబా, కూర్చొని పాదాలు కడిగారు. పిమ్మట యీరుచ్ బేసిను తీసి, నీటిని బయట పారపోశాడు.

జరుగుతున్నదేమిటో ఆ యువతికి బోధపడలేదు. ముందుగా ఏమీ చెప్పకుండా తమ కార్యక్రమాన్ని ప్రారంభించటంతో అంతా ఆమెకు అగమ్యంగా కనపడింది. బేసిను తీయగానే బాబా అతని తడిపాదాల్ని టవలుతో తుడిచి, ఆ టవల్ని ఆమెకిచ్చివేశారు. ముందుకు వంగి, వ్యాధిగ్రస్తుడైన వ్యక్తిపాదాలపై తన శిరస్సునుంచి ప్రణామం చేశారు. పిమ్మట ఓ కవరులో పెద్దమొత్తంలో పైకముంచి ఆ వ్యక్తికందించారు. అయితే పాపమతడు కనీసం కదిలేస్థితిలో లేనందున పైకమున్న కవర్ని అతని ఛాతిపైవుంచి, దానిపై అతని చేతిని పెట్టారు.

ఆ వ్యక్తి ఛాతిపై వుంచిన కవర్లో పైకం ఉందని, దాన్ని జాగ్రత్తచేసుకోమని ఆ యువతితో సౌంజ్ఞలు చేయగా, యూరుచ్ వివరంగా మాటల్లో చెప్పాడు. బాబా తరఫున అలవాటుప్రకారం ఆ పైకాన్ని భగవంతుని కానుకగా స్వీకరించి, తమను తృప్తిపరచమని కోరాడు. అలా చెప్పగానే క్షణమన్నా ఆలశ్యం చేయకుండా బయటకు వచ్చేశారు.

యీ హఠాత్సంఘటనకు విస్తుబోయిన యువతి కృష్ణప్రభువు పాదాల ముందు సాగిలపడి, ఆవేదనతో విలపిస్తూ ప్రార్థించింది. "హే! ప్రభూ! నీవింత కరుణామయుడవని, నేనెన్నడూ ఎరుగలేకపోతిని. దయగలవాడివని, జాలిగలవాడివని తెలుసుకోలేకపోతిని. నేను నిన్ను సహాయమర్థించి ప్రార్థించితినో లేదో, మరికొద్ది నిమిషాల్లోనే ఆదుకొని సహాయాన్ని పంపావు " అంటూ పరిపరి విధాల విలపించింది. ఆ విగ్రహ రూపంలో వున్న తానారాధించే

ఆకృష్ణుడే యిప్పుడు తన చెంతకు మానవ రూపధారియైవచ్చిన ట్లామె కొద్దిగా అర్థంచేసుకోకలిగింది.

ఇది ఎంతో హృదయ విదారకమైన సంఘటన. సరియగు సమయానికి, బాబా సందర్శింపటం జరిగింది. అక్కడ బాబా సంతోషంగా గడిపారు. దీపావళి పర్వదినాన మట్టిప్రమిదలన్నా వెలిగించే స్తోమత లేనివారింట తన దర్శన భాగ్యంతో వారిహృద యాల్ని తేజోవంతంచేసి, ఆ ముగ్గురికి నిజమైన దీపాలవెలుగు ప్రసాదించారు.

## హైదరాబాదు సంఘటన

తమిళనాడులో పర్యటించి, కొందరు మస్తుల్ని కలిశారు. చాలామంది పేదవారికి సహాయం అందించారు. తరువాత తిన్నగా హైదరాబాదు చేరారు. దారిలో ఎన్నో సంఘటనలు జరిగాయి. అయితే అవన్నీ బహుశః యిప్పుడు చెప్పబోయే సంఘటనంత విశేషమైనవి కాకపోవచ్చు. హైదరాబాదు చేరగానే అర్హత కలిగిన పేదవారి వేట మొదలైంది. బాబా ఒక " ఈద్‌గా"లో కేవలం లంగోటీమాత్రం ధరించి, ఒక అరగంటసేపు కూర్చున్నారు.

శిష్యులు, తగిన అర్హతలున్నవ్యక్తికోసం గాలిస్తూ అనేకమందిని నగరంలో విచారించారు. తుదకు బాగా బ్రతికిన ఓ నవాబు గురించి తెలుసుకున్నారు. ఆ నవాబు సకల సంపదలను పోగొట్టుకొని యిప్పుడు కడు బీదరికంలో కుటుంబ భారాన్ని పోషిస్తున్నట్లు తెలిసింది. బ్రహ్మాండమైన భవంతుల్లో వుండుట

కలవాటు పడిన ఆ కుటుంబం యిప్పుడు సర్వమూ కోల్పోయి, వుంటానికిల్లుగాని, ఆఖరికో చిన్నగదన్నా లేక బాధపడుతున్నట్లు తెలుసుకున్నారు.

ఆరు బయట, ఎవరి పంచనో చేరి, వరండాలో తలదాచు కొని కాలం వెళ్ళబుచ్చుతున్నారు. భుక్తి గడవటానికి, చుట్టా బీడీ, సిగరెట్లు, అగ్గి పెట్టెలు, సబ్బు పెట్టెలు అమ్ముకొని, దుర్భర జీవితాన్ని వెళ్ళదీస్తున్నాడు. ఆయన తండ్రి ఒక కోటీశ్వరుడు. అంత ఆస్తినీ, కొడుక్కిచ్చి, చనిపోతూ "చూడు నాయనా ? నీకు పదితరాల వరకు తరగని ఆస్తి వప్పగిస్తున్నాను. ఎంతో విలాసంగా జీవించ వచ్చును. జాగ్రత్తగా కాపాడుకో" అని చెప్పాడు. అయితే భోగలాలస జీవితంలో కొడుకు తండ్రిని మించి పోయాడు. ఆయన కెన్నో ఏనుగులుండేవి. ఏనుగుల్ని మేపట మంటే ఐశ్వర్యానికి చిహ్నం. రైల్వే కంపెనీతో ప్రత్యేక ఏర్పాటు చేసుకొన్న రెండు స్వంత రైలు పెట్టెలుండేవి.

అలా విలాసవంతమైన జీవితం గడిపి, వ్యసనాలతో, వున్న ధనమంతా ఖర్చు చేశాడు. ఆస్తంతా హారతి కర్పూరంలా కరిగి పోయింది. యీయన విషయం తెలుసుకున్న బాబా శిష్యులు ఆయన ఎక్కడ వుంటున్నాడో తెలుసు కుందుకు ప్రయత్నించారు. చివరికి ఒక ధర్మసత్రపు వరండాలో వున్న వృద్ధునొకనిని చూచి, అతడే తమకు కావలసిన నవాబని తెలుసు కున్నారు.

అతడున్న వరండా దగ్గరకు వెళ్ళి గుర్తించే సమయంలో పాపమా ముదుసలి వ్యాధిగ్రస్తుడై, వరండాలో వణుకుతూ ఓ

మూల పడుకొని వున్నాడు. సంరక్షణ చేసే వారెవరూ ప్రక్కన లేరు. అసలు శిష్యులు వెతికే వ్యాధితుడవునో కాదో నని మరో సారి ఆరాతీసి అతడేనని నిర్ధారించు కున్నారు.. అప్పుడు బాబా, శిష్యులతో పాటు అక్కడే వున్నారు. వారితో పాటు బకెట్టు, బేసిను, నీళ్లు అన్నీ సిద్ధంగా వుంచు కున్నారు.

ముందుగా యూరుచ్ ఆ వృద్ధునితో తన అగ్రజుని కోరిక వెల్లడిస్తూ మామూలుగా జరిగే తతంగం పూర్తి కాగానే, ఆర్థిక సహాయం చేయడం జరుగుతుందనిచెప్పాడు. అన్నిటికీ అతడంగీకరించాడు. ఏ విధమైన అభ్యంతరం చెప్పలేదు. పాదాలు కడిగేందుకు వీలుగా వరండా చివరకు జరగమని యూరుచ్ అడిగాడు. చివరికెలాగో ఆ వృద్ధుడ్ని వరండా అంచున నేలపై కూర్చోపెట్టారు బాబా కూడ సహాయపడ్డారు.

అతడు కాళ్లు జాపుకొని, పాదాలు కొంచెం ముడుచుకొని కూర్చొనేటట్లు కూర్చోపెట్టారు. వృద్ధుని చుట్టూ శిష్యులు నిలబడ్డారు. బాబా అతడి పాదాలు కడిగి, శుభ్రంగా పొడిగా తుడిచారు. పిమ్మట తమ శిరస్సు అతని పాదములపై వుంచి నమస్కరించారు. సరిగా అదే సమయంలో పాపమా వృద్ధుడు శ్వాస గట్టిగా పీల్చి, వెనుక వున్న ఓ శిష్యుని వొళ్లో ఒరిగి పోయాడు. తక్కిన శిష్యులు గబ గబా అతడ్ని నేలపై పడుకో బెట్టారు.

ఇది చూచి, యిరుగు పొరుగు వారు గుమిగూడారు. ఎవరో అపరిచితులు వచ్చి, అన్యాయంగా ఆ వృద్ధుడ్ని చంపేశారని

శిష్యులపై విరుచుకు పడ్డారు. దాంతో బృందమంతా గాభరా పడ్డారు. కానీ బాబా మటుకు తన కార్యక్రమాన్ని వరుస క్రమంలో యధా విధిగా కొనసాగిస్తూనే వున్నారు. పైకమున్న కవరు తీసి, బాధ్యతగల వారికి మాత్రమే యివ్వమని యూరుచ్ నాదేశించారు. అంత యూరుచ్, అక్కడ గుమిగూడిన వారితో, 'యీ వ్యక్తికి సంబంధించిన వారెవరైనా వున్నారా?' అని అడిగాడు.

అంతలో గుంపులోని కొందరాడవాళ్లు శాపనార్ధాలు పెడుతూ, ఆయన భార్యే వుండని, తన భర్తకు మందులు తెచ్చేందుకై ఆసుపత్రికి వెళ్లిందని, చెపుతూ, ఆమె రాగానే తన భర్త మరణ వార్త విన్నదో, మీకు చావు మూడగలదని హెచ్చరించారు. ఆ దంపతులిరువురూ అన్యోన్యమైన ప్రేమాభిమానాలు కలిగిన విడదీయరాని జంట. అందుచేత ప్రియుని ఎడబాటుకామె తట్టు కోలేదని వారి బాధ.

శిష్యులుమాత్రం ఏమీ జరుగనట్లే ప్రశాంతంగా వుండి పోయారు. కానీ లోపలమాత్రం అంతరంగంలో జరిగిన దానికి బాధపడుతున్నారు. ప్రక్కనే ఒక గది ఖాళీగావుంటే శిష్యులు ఆ వృద్ధుని ఆగదిలోకిచేర్చి పడుకోబెట్టారు. బాబాకూడ స్వయంగా మోయుటలో సహాయంచేశారు. అతడెంతటి అదృష్టశాలో కదా ! గదిలో పడుకోబెట్టింతర్వాత అతని ముఖంపై కొంచెం నీళ్ళు చిలకరించి, గాలి విసరటం మొదలెట్టారు శిష్యులు. అలా చేయగా అతనిలో కొంచం చలనం కలిగింది. పునరుజ్జీవితు డైనాడని

తెలియగానే, బయట అరుపులు కేకలు అన్నీ ఒక్కసారిగా ఆగిపోయాయి.

అంతలో అతని భార్య వచ్చింది. ఆమె వచ్చీరాగానే అక్కడచేరిన స్త్రీలు కొందరు జరిగింవంతా ఆమెకు తెలియచేశారు. ఆమె వెంటనే గదిలోకి వచ్చి అక్కడున్న అపరిచితులను చూచి "అయ్యా! యీాయన మీకేమి అపకారంచేశాడు ? ఆయన నుండి మీకేంకావాలి ? ఎందుకాయనవలా హింసిస్తారు ? ఆయన వ్యాధి గ్రస్తుడు. మేమిప్పటికే సర్వం కోల్పోయాం. బంధుమిత్రులు, సర్వప్రపంచంతో హింసించబడి, తృణీకరించబడి వున్నాం. యింకా మమ్మల్నెందుకు బాధిస్తారు ?" అంటూ గద్గదస్వరంతో భోరున ఏడ్చింది.

శిష్యులామెను ఓదారుస్తూ, ఆవేశపడవద్దని, ముందు కొంత సేద తీర్చుకోమని బ్రతిమలాడారు. తర్వాత ఆమెకు తమ అగ్రజుడ్ని పరిచయం చేశారు. ఆయన ప్రత్యేకించి బొంబాయి నుండి తమకో చిరుకానుక సమర్పించాలని వచ్చారని చెప్పారు.

విషయం విన్నామె " అలాగా బాబూ ! భగవంతుడెంతటి కరుణామయుడు ? మా మీద ఎంత దయ కలిగిందాయనకు ? హే ! భగవాన్ ! ఇన్నాళ్ళకి మా మీద కనికరించావా ? " అంటూ విలపించ సాగింది. అంతలో బాబా చేతులు కదల నారంభించాయి. సౌంజ్ఞలందిస్తున్నారు. శిష్యులు నిశ్శబ్దంగా నిలబడ్డారు. బాబా స్వయంగా తమ దివ్య హస్తాలతో, కానుక వున్న ప్యాకెట్టు నామె కందించారు.

ఆయన సౌంజ్ఞలను యూరుచ్ మాటలలో చెబుతూ, "ఇది భగవంతుడిచ్చే కానుకగా మీ కిప్పుడు సమర్పించ బడింది. దీనిని మీ రంగీకరించి మమ్మానందింప చేయండి !" అని కోరాడు. పాపమా వృద్ధురాలు తన ముందేమి జరుగుతున్నదో తెలుసుకో లేక తల్లడిల్లి పోయింది. అంతా అగమ్యంగా తోచింది.

" ఏమిటీ సుడిగాలి ? ఆశ్చర్యంగా వున్నది. మాకిలా సహాయమందిం చేవారెవరున్నారు ? ఏమిటిదంతా ? " అంటూ విస్తు పోయింది. బాబా ఆజ్ఞప్రకారం యూరుచ్, ఆమెను పూరడింప చేస్తూ, "విచారించకమ్మా! యీ పైకాన్ని మీ కొరకు మీ భర్త కొరకు వుపయోగించండి ! " అని చెప్పాడు. తర్వాత వాళ్లను వదిలేసి బాబా తన శిష్యుల్తో వెళ్లిపోయారు. దాంతో ఆ గదిలోని వాతావరణమే మారిపోయింది. అక్కడ చేరిన వారంతా భగవంతుని కీర్తించడం ప్రారంభించారు.

ఆ నవాబుకు, తాను తీసుకున్న పైకం, భగవంతుడిచ్చిన ప్రసాదమో, భగవంతుడు పంపిన సహాయమో తెలియదు. బహుశః బాబా జీవిత కాలంలో జరిగే ఇలాంటి సంఘటనలు, నిస్వార్థ సేవతో ఎలా సహాయపడాలో తెలిపేందుకు, ఉదాహరణలుగా వుద్దేశించ బడి వుండవచ్చును.

## మస్తు సేవ

తూర్పుకోస్తాతీరంలో బాబా జరిపిన మస్తు కార్యక్రమం చెప్పుకోతగింది. నవజీవనంలో జరిపిన యీ మస్తు కార్యక్రమం

కూడా పూర్వజీవనంలో ఆచరించిన విధంగానే జరిగింది. కాకపోతే యీ మస్తు సేవలో వారికి స్నానంచేయించుటలో మిత్రుల్నికూడా సహాయ పడేందుకు అనుమతించారు. అది పట్టణం కానీ, నగరం కానీ బైదులు పూరంతా తిరిగివచ్చి మస్తుల ఆచూకీ తెలుసుకొనే వాడు. వారి నతడు స్వయంగా కలుసుకొనేవాడు.

వారే అసలైన మస్తులని, అతనికి నమ్మకం కుదిరితే, బాబాతో సంప్రదించి కలుసుకునే ఏర్పాటు చేశేవాడు. అలా కలసిన మస్తులందరి జీవితాల్ని కథలుగా వ్రాయాలంటే, ఎన్ని పేజీలైనా చాలవు. వాళ్ళు పైకి తిడుతూ కనపడినా, అంతర్గతంగా హృదయ మంతా ప్రేమతో నిండి వుంటుంది. బాబా వారిని కలిశాక, వారి హృదయాలు ప్రశాంత వదనంతో వికసించటమో, లేక దివ్య ప్రేమతో ప్రజ్వరిల్లటమో జరిగేది.

ముఖ్యంగా అదంతా బాబా చేసే కార్యక్రమ విధానంపై ఆధారపడేది. అనేక రాష్ట్రాల్లో జరిపిన ప్రస్తుత ప్రయాణంలో, బాబా చాలామంది మస్తులకు వారికిష్టమైనవాటిని తమ ప్రసాదంగా యిచ్చేవారు. తద్వారా వారికి తమ ఆధ్యాత్మిక సహాయమందించా రనుటలో సంశయంలేదు. యీ యుగంలో బాబా చేసిన మస్తు కార్యక్రమం నిర్వచించలేని అద్భుత అవతార కార్యక్రమం. ఒక చిన్న మస్తు సంఘటన గురించి తెలుకుందాం.

బాబా బృందం రైల్లో ప్రయాణం చేస్తున్నారు. రైలు "కాల్గాం" అనే చిన్న స్టేషనులో ఆగింది. ఆ స్టేషను సమీపంలో ఓ మస్తున్నాడు. అంతా అతడ్ని పిచ్చివాడనుకొనేవారు. అతడు

తన సమయాన్నంతా రైలు స్టేషను ప్లాటుఫారంలోనే గడిపేవాడు మధ్య మధ్య దగ్గర్లోని వీధులుకూడ తిరిగేవాడు.

అతడ్ని గురించి తెలుసుకున్న బాబా ఆ మస్తును కలుసుకోవాలనుకున్నారు. బైదుల్ని పంపి అతడ్ని రైలు వద్దకు తీసుకు రమ్మనమన్నారు. అందు కాతడు, బాబా తన బృందంతో ఆ రాత్రికి తన అతిధులుగా వుంటామంటే వస్తానన్నాడు. మస్తు కోరికల కనుగుణ్యంగా నడుచుకోవటం బాబా నియమం. అయితే యీ సందర్భంలో బాబా, తమను మరో రైలులో వెళ్లిపోవుటకనుమతించమని, తన ఆహ్వానాన్ని రద్దు చేసుకోమని మళ్లీ తిరుగు కబురంపారు. అందుకా మస్తు ససేమిరా వినిపించుకోలేదు.

కాసేపైంతర్వాత, అతడే స్వయంగా ప్లాటు ఫారం మీదకు వచ్చి, తన ఆహ్వానాన్ని మన్నించి వుండి పొమ్మని అడిగాడు. పిచ్చివానితో మాట్లాడుతున్న బాబా బృందాన్ని చూచి, ప్లాటుఫారం మీద వున్న తోటి ప్రయాణీకులు చుట్టు ముట్టారు. మొదట్లో జరిగేదేమిటో అర్ధంకాక, కొంత తడవు గుంభనంగా వున్నా, మస్తు కేకలతో వెర్రెక్కిన ప్రజలు, బైదుల్ని, యీరుచ్‌ని ఒక గుంజు గుంజి, అవతలికి పడదోసి, వారి ఒడుపులో వున్న మస్తుని స్టేషను బయటకు తీసుకుపోయారు.

మౌనంతో బాబా అంతా చూస్తూ నవ్వుకుంటున్నారు. అంతలో వారి గమ్యం చేరే మరో రైలు వచ్చింది. ప్రయాణీకులంతా హడావిడిగా పరుగెత్తు కొచ్చారు. సీట్లు సంపాదించాలని

పెట్టెల్లోకి జారబడ్డారు. అంతలో మస్తు బయట నుండే బాబాను తన బృందంతో రైలెక్కమని సౌంజ్ఞ చేయడం గమనించిన బాబా, మిత్రులతో కలసి ఆ రైలెక్కారు. మిగతా జనమంతా బాబా బృందంతో పాటే, రైలు పెట్టెక్కారు. దానిని గురించి విశేషంగా పెట్టెలో చర్చించు కున్నారు. బాబా మండలిని గుర్తించ కుండానే, అక్కడ జరిగిన దానికి వాళ్ళే కారణమని కొందరు నిందించుట కూడ జరిగింది.

తన కార్యక్రమాల్లో వివిధ ఘట్టాలు పూర్తి చేసుకొని, కొన్నాళ్ళపాటు విరామంగా విశ్రాంతి తీసుకోవాలను కున్నారు. అంటే అదీ ఒక రకమైన కార్యక్రమ మార్పే కావచ్చు. విశ్రాంతి కోసరం తమ మకాం బొంబాయికి మార్చారు. ఒక్కొక్క కుటుంబానికి వెయ్యేసి రూపాయలు చొప్పున తనతో పూర్వ జీవనంలో సంబంధం వున్న వారికి యిచ్చి బొంబాయిలో పైకం పంచి పెట్టే కార్యక్రమాన్ని విరమించారు.

అప్పట్లో బొంబాయిలోని " బ్రబోరన్ " స్టేడియంలో భారత, కామన్‌వెల్తుల జట్ల మధ్య క్రికెట్ పందాలు జరుగు తున్నాయి. ఆ పోటీలు చూడాలని బాబా సంకల్పించి, తన మండలిని తీసుకొని స్టేడియంకు వెళ్లారు. ఉత్తర వైపు విభాగంలో ప్రేక్షకుల గ్యాలరీలో కూర్చుని పోటీని తిలకించారు. బ్యాట్స్‌మన్ చూపుతున్న ప్రజ్ఞకు పేక్షకులు చేసే కేరింతలతో బాబా కూడ వుత్సాహం చూపారు. బ్యాటింగు చేసినప్పుడు బంతిని పట్టుకో లేక పోయిన ఫీల్డర్లను చతురోక్తులతో ప్రేక్షకులు వుత్సాహపరుస్తుంటే, ఆయన కూడ శృతి కలిపారు.

డిశంబరు 5 న, తోటి మిత్రుల్ని, ఏర్పాటువాలాలను తన గదికి పిలిపించారు. ఆయన చాలా అలసినట్లున్నారు. యీవాళ తాను స్టేడియంకు రాలేనని వారితో చెప్పారు. భోజనం కాగానే రేడియో పెట్టమని సౌంజ్ఞ చేశారు. క్రికెట్టు స్కోరు వింటానికి పెట్టమన్నారనుకున్నారు మండలి. కానీ రేడియో పెట్టగానే, పాండిచ్చేరిలో శ్రీ అరవింద ఘోష్ పరమపదించారన్న వార్త ప్రసారమైంది. అరబింద ఘోష్ భారతావనిలో ఒక గొప్ప యోగి అని బాబా ఎప్పుడూ చెబుతూ వుండేవారు.

అసలా వార్త నిజమో కాదో తెలుసుకొని రమ్మని, నారిమన్‌ని, మెహెర్జీని ఆదేశించారు. నిజమేనని రూఢీయైన తర్వాత, ఆ రోజంతా బాబా విచారంతో తన గదిలో ఏకాంతంగా వుండిపోయారు. అందుకు కారణం ఆయనకే తెలియాలి.

డిశంబరు ఆరవ తేదీన మహాబలేశ్వర్ వెళ్లి పోయారు. తన ప్రేమికులు ప్రేమ కానుకగా సమర్పించు కొన్న పైకం యొక్క జమా ఖర్చుల విషయంలో ఆయన ప్రత్యేక శ్రద్ధ తీసుకున్నారు. తన శిష్యుడొకర్ని పిలిచి, తమ ప్రయాణంలో చేసిన ఖర్చులన్నీ జాగ్రత్తగా లెక్క వ్రాయమన్నారు. అలా వ్రాయించి, లెక్కలు సరి చూచాక, మిగిలిన పైకాన్ని తగు సూచనలతో ఏర్పాటువాలాలకు వప్ప చెప్పారు.

జమా ఖర్చుల వివరాలన్నీ బాబా పరివారం అందరికీ పంచి పెట్టించారు. ఖర్చు విషయంలో ఒక్కోసారి బాబా విపరీతంగా ఖర్చు పెట్టేవారు. ఒక్కొక్క సారి పైసా కూడా దుబారా ఖర్చసేవారు. అదంతా ఆయన చేసే కార్య

క్రమాన్ననుసరించి వుండేది. ఆ సమయంలో వుండే ఆధ్యాత్మిక అవుసరాన్ని బట్టి వుండేది. యీ ప్రయాణకాలంలో తాను పేద వారి కొరకు వేలాది రూపాయలు ఖర్చు పెట్టినా, బాబా బృందానికి అవుసరమయ్యే ఖర్చుల్లో మాత్రం చాలా పొదుపు పాటించారు.

పూర్వ జీవనంలో మస్తు ప్రయాణాలు మాదిరే యీ ప్రయాణాలు కూడ అన్నీ కష్టాలతోటే గడిచాయి. వేళకాని వేళ అర్థాకలితో భోజనం చేయటం, ఏ కొద్దిసేపో తీరిక చేసుకొని నిద్ర పోవటం ఆయనతో వున్న సహచరులు చవి చూచిన చేదు అనుభవాలు.

## బాబా ప్రేమ సాగరుడు

బాబా సతారాలో వున్నప్పుడు ఒక పొట్టి గుర్రాన్ని కొన్నారు. దానికి " బీగమ్ " అని పేరు పెట్టారు. మహా బలేశ్వర్‌కు తెచ్చారు. రోజూ వుదయం పూట, మహాబలేశ్వర్‌లో బాబా, స్త్రీ మండలితో వాహ్యాళికి కాలినడకన వెళ్ళేవారు. ఈ బీగమ్ కూడ వారితో పెంపుడు కుక్కలా వెళ్ళేది. ఫ్లారెన్సు హాల్లో అది నిర్భయంగా వరండాలోకి ఎక్కి బాబా వున్న గదిలోకి వెళ్లేది. అక్కడాయన దానితో క్యారెట్లు తినిపించే వారు. బాబా ఒక వేళ లేకపోతే ఆయన వచ్చే వరకూ ఆగి వుండేది. మూగజీవాల పై బాబా చూపే అపారదయ, అవ్యాజాను రాగ ప్రేమలు, ఆయన జీవితంలో తరచుగా కనపడతయి.

పాత జీవితంలో బాబా చేసిన మస్తు పని సంగతి, మస్తుకి, బాబాకే తెలిసేది. మండలి వారి నెవర్నీ దగ్గరకు రానిచ్చేవారు కాదు. అయితే నవజీవనంలో చేసిన మస్తు కార్య

క్రమంలో శిష్యుల్ని కూడా వుండేందు కనుమతించారు. తానొక అన్వేషకుని వలె, ఆ మస్తుకు ప్రణామం చేసి, తాను సంకల్పించిన ఆధ్యాత్మిక వుద్దేశ్యాలు నూటికి నూరుపాళ్లు దిగ్విజయంగా నెరవేరేట్లు ఆశీర్వదించమని, మస్తునడిగేవారు.

నవజీవనంలో మస్తులతో సాంగత్యం చేయడానికి ముందు అతడు ప్రశాంతంగా వున్నాడో లేదో, చూచేవారు. మస్తుతో చేయవలసిన కార్యక్రమం పూర్తి కాగానే ఒక రూపాయి డబ్బిలిచ్చేవారు. అతని పాదాలపై శిరస్సునుంచి ప్రణమిల్లేవారు. అది కాగానే పక్కనున్న సహచర మిత్రులు, బైదుల్ లేక యూరుచ్‌లు తమ అగ్రజుని ఆధ్యాత్మికోద్దేశం నెరవేరు గాక అని దీవించమని ఆ మస్తుని కోరేవారు.

మస్తు చెప్పిన మాట వినక ఏడిపించే వాడైతే అలా దీవించమని అడిగే వారుకారు. అలాగే, బీదవారికి సహాయమందించటం ఒక విశేష కార్యక్రమం. అటువంటి వ్యక్తులకు దానం చేసేప్పుడు, అవకాశం వున్నంత వరకు, సహాయపడుతున్న దాత 'మెహెర్‌బాబా' అని ఎవరికీ చెప్పేవారు కాదు. అట్టి దానం తీసుకున్నందు వల్ల, తీసుకున్న వారు యిచ్చిన వారికి ఋణపడినట్లనుకోవద్దని, శిష్యుల చేత చెప్పించే వారు. అది ధర్మం కాదని ప్రేమతో యిచ్చిన ప్రేమ కానుకని చెప్పేవారు. పేదవాని కాళ్లు కడిగి, పాదాలకు శిరము వంచి నమస్కరించి, కానుక నందింపటం ముఖ్య విశేషం.

బాబా చేసిన యీ ప్రత్యేక ప్రయాణంలో 119 మస్తులను,

45 మంది యోగులను కలిశారు. 33 కుటుంబాల వారికి, 250 మంది పేదలకు సహాయమందించారు.

## క్రిస్మస్ వేడుకలు

ఆ సంవత్సరం మెహెరా జన్మదినం, క్రిస్టమస్ పండుగతో కలిసి వచ్చింది. పూనా భజనబృందాన్ని పిలిపించి, ఆమె జన్మదినాన్ని ఘనంగా జరుపదలచారు. యీ భజనబృందంలో అంతా చిన్న పిల్లలే. వాళ్లంతా బాబా ప్రేమతో పునీతులైనారు. ఆర్. కె. గడేకార్‌కీ, భజనబృందాన్ని డిశంబరు 24 వ తేదీకల్లా, మహాబలేశ్వరం పంపమని కబురంపారు.

తాడే సోదరులు మధుసూధన్, ప్రతాప్ తదితరులకీ వార్త తెలియగానే వారానందపరవశులైనారు. అయితే బాబా యీ భజనబృందంలోని పిల్లలందరి ప్యాస్ పోర్టు సైజు ఫోటోలు ముందుగా తనకు పంపితే అందులో ఎవరు తన వద్దకు వచ్చి, తమ సన్నిధానంలో గానం చేసింతర్వాత యింకా కొంత కాలం తమ వుండుట కనుమతించబడుటకు ఎంపిక చేస్తావని తెలియపరిచారు.

బాబా దివ్య లీలలను, యీ పసిహృదయాల్లో హత్తుకు పోయేట్లు కథల రూపంలో డా॥ ఘనీ వీరికి చెబుతూ వుండేవాడు హఠాత్తుగా యిప్పుడు వచ్చిన యీ పిలుపుతో, వాళ్లెంత అదృష్ట వంతులో ఎరుక పరచి వుత్సాహపరచాడు. తాను కూడ వాళ్లతో వెళ్లాలని సంకల్పించి బాబా అనుమతి కోరాడు. అయితే కేవలం భజనబృందం వారు మాత్రమే రావాలని బాబా ఆంక్ష విధించుటతో

పాపం షనీ హతాశుడైనాడు. కానీ ఒక చక్కని ఘజల్ వ్రాసిచ్చి ఆ పిల్లల్ని బాబా ముందు గానం చేయమన్నాడు.

బాబా ఆజ్ఞలమేరకు, పిల్లలఫోటోలు పంపటం, అందులో తమ సన్నిధానానికి రావలసినవారి ఎంపిక జరగటం అన్నీ పూర్తయ్యాయి. అంతలో, కాక్‌సాహెబ్ అనే పాత శిష్యుడు తాను కూడ మహాబలేశ్వరం వెళ్దామనుకున్నప్పటికీ బాబా అంత అనుమతించనందున ఓ చక్కని ఘజలు వ్రాసి పిల్లలకిచ్చి బాబాసమక్షంలో పాడమని కోరాడు. పాపం కాక్‌సాహెబ్ ఆ మర్నాడే బాబాలో ఐక్యమయినాడు. అతను పిల్లలకు వ్రాసిచ్చిన ఘజలే అతని ఆఖరి వేడికోలైంది.

డిశంబరు 24 కల్లా భజనబృందం మహాబలేశ్వరం చేరింది. వాళ్ళ విడిదిఏర్పాట్లన్నీ విష్ణూ చూచాడు. వారొచ్చిన సాయంత్రమే వారి భజన కార్యక్రమం ఏర్పాటుచేయమన్నారు బాబా. భజనబృందాన్ని చూడగానే బాబా కళ్ళుమిరుమిట్లు గొలిపాయి. ఆనందాతిరేకంతో "మీరంతా వచ్చినందుకు నాకెంతో సంతోషంగా వుంది. రేపు వుదయం మీరు ఫ్లొరెన్సు హాలు చూడాలి. మళ్ళీ అప్పుడు పాడుదురుగాని. బాగా గుర్తుంచుకోండి. ఎట్టిపరిస్థితులలో కూడ పాతజీవితానికి సంబంధించిన విషయాలేవీ మాట్లాడకూడదు." అని చెపుతూ, అహిర్ ప్రతాప్ అనే చిన్న పిల్లవానివైపు చూపుతూ కార్యక్రమం పూర్తయింతర్వాత, మరి కొన్నాళ్ళు తమతో వుంటావా ? అని అడిగారు.

" ఓ ! తప్పకుండావుంటాను బాబా ! " అన్నాడు ప్రతాప్.

అతడెంతటి అదృష్టవంతుడో కదా! భజన ప్రారంభమయింది. ప్రతాప్ పాడుతున్నప్పుడు బాబా ముగ్ధులై పోయారు. అతడ్ని పిలిచి తన ప్రక్కన కూర్చోమన్నారు. ముఖ్యంగా కాక్ సాహెబ్ వ్రాసిచ్చిన భజలు పాడేప్పుడు, ఘడేకార్ కళ్ళవెంట నీళ్ళొచ్చాయి. కాక్ సాహెబ్ మరణవార్త బయటపెడదామనుకొనికూడ, బాబా ఆజ్ఞమేరకు దిగ మ్రింగాడు. అయితే సర్వజ్ఞుడైన బాబా అతని మనోగతాన్ని తెలుసుకొని, "అంతా నాకు తెలుసును. విచారించకు" అని సౌంజ్ఞలు చేశారు.

మర్నాటిపుదయం 7 గంటలకు భజనబృందం బాబా గది దగ్గరకు చేరారు. బాబా ఆదేశంతో ప్రియతముడైన భగవంతుని ప్రేమను కీర్తిస్తూ, వివిధ వాయిద్యాలమధ్య వీనులవిందు కల్పిస్తూ గానం చేశారు. పిల్లల గాన మాధుర్యానికి బాబా ముగ్ధులైనారు. "ఇంత బ్రహ్మాండంగా పాడుతున్న మీరంటే నాకెంతో యిష్టం. ఇప్పటి వరకూ కృష్ణుడు మీద పాటలే పాడారు. రాధ మీద పాటలు రావా ?" అన్నారు. అప్పుడా పిల్లలు రాధ మీద పాట పాడుతుంటే బాబా ఆనందం అవధులు దాటి, తానొక మద్దెల తీసుకొని వాయించడం ప్రారంభించారు.

అలా డోలక్ వాయించేప్పుడు, అక్కడే వున్న పాద్రి ఫోటో కూడ తీశాడు. యీ రెండు రోజుల కార్యక్రమంలోను ఆది చాలా ఫొటోలను ఆయన వివిధ భంగిమల్లో తీశాడు. రెండు రోజులు భజన కార్యక్రమాలు ముగియగానే భజనబృందం ఎవరి దారిన వారు వెళ్ళిపోయారు. ఆనాడు డిశంబరు 25. క్రిస్టమస్ పర్వదినం. అందునా మెహెరా జన్మదినం. శిష్యులందరికీ

ఆటవిడుపు. ప్రక్కనున్న అడివికెళ్ళి ఒక చిన్న చెట్టు సమూలంగా పెకలించి తెచ్చి, బాబా గదిలో ఒక బల్లపై వుంచా. మెహెరా, మణి, మెహరూ ఆ చెట్టును కాగితం పూ అలంకరించారు.

మణి చెట్టు చివర్లో ఒక దేవత వున్నట్లు అమర్చి రానో, నజాలు ఆ చెట్టు నిలబెట్టిన బల్లను అందంగా అ రించారు. ఘుమ ఘుమలాడే వంటకాలతో ఆ బల్లమీద యిల్లు ఆకారంలో అమర్చారు. దానిని క్రిస్టమస్ కాటేజీ అన్నా దాన్లో ఓ దీపం పెట్టారు. దానికో కిటికీకూడ అమర్చి, ఎవరో తొ చూస్తున్నట్లు బొమ్మనమర్చారు. క్రీస్తు పుట్టిన రోజున అః పురుషుడైన మెహెర్ ప్రభువు ఆ పవిత్ర వృక్షం ప్రక్కన బడ్డారు. బాబా ముఖారవిందంపైన చిరునవ్వు తొణికిసలాడి అదే సమయంలో ఓ లేడిపిల్ల ప్రక్కనున్న అడివిలోంచి లేస్తూ బాబా దగ్గరికొచ్చింది. యీ విధంగా అందరికీ ఆః కల్పించి బాబా క్రిస్టమస్ పండుగ జరుపుకున్నారు.

– : మూడవ భాగం సమాప్తం : –

## Check List

| | | | |
|---|---|---|---|
| Book Number | G.V.P01 P113 | Date | 8/1/21 |
| | yes | | yes |
| Blank Pages | C P 113 | | |
| Missing Pages | no | | |
| Prepared | Lakshmi | Scanned | Ramya |
| BOOK SIZE | H 7 W 4.7 | Pages | 135 |